# శ్రీరామ బ్రహ్మాశ్రమము వారి ప్రార్థన

భక్తులారా!

ఈ యాశ్రమమొక సేవాసంస్థ, ఇది 1931 ప్రజోత్పత్తిలో స్థాపింపబడినది. స్థాపకులు. ఇంకొల్లు శ్రీరామ శర్మ

ఉద్దేశ్యము:- శ్రీబ్రహ్మేంద్ర స్వాములవారి భక్తి ప్రచారము

దీనికి 4 శాఖలు గలవు

1 భక్తసమాజశాఖ:- దీనిమూలమున సంకీర్తనము భజన ప్రభాతసేవ పూజ ఏకాంత సేవలను నామైకాహ సప్తాహ పారాయణాదులను వృద్ధికి దెచ్చుచున్నాము.

2 గ్రంథమాలశాఖ:- దీనిద్వారా స్వామివారిచరిత్ర ననేక విధముల గ్రంథరూపమున వ్యాప్తి జేయుచున్నాము. ఈ గ్రంథముల ప్రకటన కట్టకడ నట్టపై చూడుడు.

3 ఉపకరణశాఖ:- దీనిద్వారా పటములు విగ్రహములు చిటికలు జపమాలలు బ్రహ్మపాదములు చలువ చప్రములు లోనగునవి సరియైన ధరలకందించి భక్తులకు దోడ్పడు చున్నాము.

4 భగవన్నామక్రియాశాఖ:- దీనిద్వారా భగవన్నామము తోశుద్ధిచేసిన యనేకక్రియలను రోగులకిచ్చి వారిని వజ్ర దేహులుగాను సంతానవంతులుగాను జేయుచున్నాము.

కావున పైన కనబరచిన వానిలో దమకు కావలసిన గ్రంథముల గొనిగాని, ఉపకరణముల దీసిగాని, క్రియల గ్రహించిగాని ఉద్యమమునకు దోడ్పడుడు. ఇదియే ప్రార్థన.

మరా:- మాకు బ్రహ్మేంద్ర పారాయణ చరిత్రము పారాయణము జేయువారు బ్రహ్మేంద్ర సంపూర్ణ చరిత్రము హరికథ చెప్పువారు కావలసిన మాకడకురండు.

ఇట్లు కర్తలు.

శ్రీరామబ్రహ్మ గ్రంథమాల
పంచమకుసుమము

శ్రీ

# బ్రహ్మేంద్రసంపూర్ణచరిత్రము

## బుఱ్ఱకథ

మఠములందు జరుగు మహోత్సవములకు గృహములందు జరుగు శుభకార్యములకు రేడియో ప్రోగ్రాములకు మిక్కిలి యనుకూలము

గ్రంథకర్త
ఇంకొల్లు శ్రీరామశర్మ (శ్రీరామబ్రహ్మము)
శ్రీరామ బ్రహ్మాశ్రమము పెదకొత్తపల్లి - ఒంగోలు

ప్రథమ ముద్రణము ప్రతులు 1000



**1953**

 **0—12—0**

# బ్రహ్మేంద్ర సర్వస్వము

ఇది బ్రహ్మేంద్రచరిత్రము నొక్కొక్క రొక్కొక్క విధముగా వ్రాసి ప్రకటించుటచే భక్తులకేర్పడిన సందేహముల నివారించుటకు ప్రారంభింప బడినది.

ఇందు బ్రహ్మముగారెవరు ? ఏకాలమున నుండిరి ? వీరికి విరాట్శబ్దమెట్లు వచ్చెను ? వీరిని గొందరు శివుడు కొందరు విష్ణు కొందరు బ్రహ్మయనుటకు గారణమేమి ? లోనగు విషయంబులనేగాక [illegible]

వారిభార్య గోవిందమ్మగారిని గుఱించి
వారి కుమారులు గోవిందాచార్యాది సోదరులగుఱించి
వారి కుమార్తె వీరనారాయణమ్మ గారిని గుఱించి
వారి మనుమరాలు ఈశ్వరమ్మగారిని గుఱించి
వారి శిష్యుడు సిద్దయ్యగారిని గుఱించి

ఇంకను కాలజ్ఞానము, వేదాంతము మానవ ధర్మాద్యనేక విషయములను గుఱించి వ్రాయుచున్నాను. కొలది రోజులలో బూర్తయగును. సుమారు 1000 పుటలుండును

దీని ప్రకటనకు 10–0–0 యిచ్చువారి పేర్లన్నియు నిందు జేర్చబడును. శాశ్వతముగా బేరునిల్పుకొనువారిందుకు బూనవలయును.

మా బ్రహ్మేంద్ర సంపూర్ణచరిత్రము
హరికథ జెప్పువారికి సూచన

అయ్యా! హరికథ నొక్కరోజు చెప్పుటకు మాత్రమే వ్రాసితిని. దానిని రెండురోజులుగ జెప్ప దలంచువారు మా యీ బ్రహ్మేంద్రసంపూర్ణచరిత్రము బుఱ్ఱకథ జూడవలయును. ఇందు గీర్తనలు శ్లోకములు పద్యములు మాటలు దానిలోకి పనికివచ్చును. కథ విరళముగ దెలియును. గ్రంథకర్త.

## ఈ గ్రంథమునకు

### రాజపోషకులు

శ్రీ బండికట్ల వేంకటరత్న శాస్త్రిగారు ఇనమనమెళ్ళూరు
వంగోలుతాలూకా

వీరీగ్రంథమునకేగాక మద్రచిత బ్రహ్మేంద్ర పారాయణ చరిత్రమునకు బ్రహ్మేంద్ర సంపూర్ణ చరిత్రము హరికథకు బ్రహ్మేంద్ర సేవాదర్పణమునకు సహాయము జేసిరి.

### పోషకులు

శ్రీ మహాంకాళి నరసింహాచార్యులుగారు చాగొల్లు
కందుకూరు తాలూకా

### అభిమానులు

శ్రీ గోరంట్ల రామయ్యగారు దొడ్డవరప్పాడు ఒంగోలు తా॥
శ్రీ రావూరి నాగభూషణాచార్యులుగారు రావినూతల ఒ.తా
శ్రీ ఇంకొల్లు హనుమంతాచార్యులుగారు పెదకొత్తపల్లి ఒ.తా

### చందాదారులు

శ్రీ శ్రీమంతుల జాలయ్యాచార్యులుగారు ఈతముక్కల ఒ.తా
చందానిర్ణయము: పోషకులకు 10–0–0 అభిమానులకు 5–0–0
చందాదారులకు 3–0–0 లు

### శ్రీరామబ్రహ్మ భక్తసమాజ సభ్యులు

శ్రీ శిరమని వెంకటాచార్యులుగారు ఒంగోలు
శ్రీ కందుకూరి హనుమాచార్యులుగారు ఒంగోలు
శ్రీ ఆదిమూలం వీరభద్రాచార్యులుగారు లింగంగుంట
శ్రీ సిద్దె వెంకట నరసింహంగారు పేర్నమిట్ట
శ్రీ షేక్ బుడేసాహేబుగారు కొత్తపల్లి

# కృతిసమర్పణము.

నాచే భక్తి ప్రచారార్థము 1931 లో శ్రీరామబ్రహ్మా శ్రమమును నెలకొల్పించి సేవాదర్పణము జేయించి 1932లో ప్రథమదర్శనమిచ్చి నవీనముగా వ్రాసిన "కోటి"నిగ్రహించి, 1933లో యువజన మహాసభా యుక్తముగ తృతీయ వార్షి కోత్సవము నెగ్గించి 1935లో గురూప దేశమిప్పించి 1937లో "శ్రీరామా! నిను రంగనిదాపుకు రమ్మంటిని" అను కాల జ్ఞాన వాక్యమునకర్థముసూచించి, లక్షనామపూజనిర్వర్తించి 1939 సం॥లో శతాహ్నిక సంకీర్తన మహాయజ్ఞమును గట్టున కెక్కించి 1941లో గోవిందాంబికా సిద్ధాంజనేయ జగదీశ్వరీ సహితముగ ఏకశిలావిగ్రహ ప్రతిష్ఠను బూర్తినొందించి, ఆ సంవత్సరమే కందిమల్లయ్యపల్లెలో సన్నిధానమున నాపై కాహా మొనర్పించి అందే, ముఖమంటపమున నాదొక యంక ణము జేర్పించి, అచటనే శాశ్వతపూజల జరిగించు భాగ్యము ప్రసాదించి 1943 లో 108 కళ్యాణములను శ్రీ విశ్వకర్మ మహాయాగమును నెరవేర్పించి, 1944లో గేయచరిత్రము జెప్పించి, 1945లో గ్రహణివ్యాధి సందర్భమున నా సన్న మృత్యువును దప్పించి 1946 లో హరికథను 1947 లో బుఱ్ఱకథను, 1948లో నాటకమును ముగింపించి "కవివతంస" బిరుదమును గ్రహించి ప్రస్తుతము సర్వస్వ గ్రంథమును వ్రాయించుచున్న జగద్గురు శ్రీ విరాట్ పోతులూరి వీర బ్రహ్మేంద్ర భగవానులవారికి భక్తితో నీ గ్రంథమును సమర్పించుకొనుచున్నాను.

ఇట్లు,

1953 గ్రంథకర్త.

# అభిప్రాయములు

సుప్రసిద్ధ నటకులును రేడియో కథకులును అగు శ్రీ తుమ్మా రామనాథాచార్యులుగారి అభిప్రాయము.

నేనీ బ్రహ్మేంద్ర సంపూర్ణ చరిత్రము బుఱ్ఱకథనంతయు జదివినాను. కథ మిక్కిలి గొప్పదిగాక కొద్దిదిగాక నింపుగా నున్నది. చెప్పవలెనని నాకే యుత్సాహము గల్గినది. బ్రహ్మముగారికి జయభేరి మ్రోగించవలెనంటె దీనినే చెప్పాలి.

ఒంగోలు　　　　　　　　ఇట్లు

1–8–53　　　　　　　　తుమ్మా రామనాథాచార్యులు

ఈబుఱ్ఱకథను నేను సాంగోపాంగముగా జూచితిని. ఇది వరకెవరును వెలిబుచ్చని విశేషముల నేకమిందున్నవి. అంతే కాదు బ్రహ్మజ్ఞానాది విషయములును గలవు. ఇది ద్రాక్షా పాకమున పండితపామర జనరంజకముగా నున్నది. బ్రహ్మముగారి ప్రతిభక్తుడు చదివి ఆనందింపవలసిన గ్రంథమిది.

9–9–53　　　　　　　　ఇట్లు

పేర్నమిట్ట　　　　　　　　ఉరాంకుశం వేంకటశేషాచార్యులు

బ్రహ్మముగారి పేరుజూచి ఉత్తమగ్రంథములే కదా యని దీసికొని చదివి మునుపున్న సందేహములకు తోడింకను సందేహము లేర్పడియున్న కాలమున శ్రీరామశర్మగారి గ్రంథములు చూచి నా సందేహముల బాసితిని. భక్తులారా! మీరీగ్రంథముల జదువుడు నిజము దెలియును.

ఇట్లు

15–9–53　　　　　　　　బండికట్ల వేంకటరత్న శాస్త్రి

# కర్తృ విజ్ఞాపనము

భక్తాగ్రేసరులారా!

నేను బ్రహ్మముగారి హరికథను రచించిన తర్వాత వారి భక్తి ప్రచారమే వృత్తిగల నాకొకప్పుడు బ్రహ్మేంద్ర చరిత్రము బుఱ్ఱకథగాకూడ వ్రాసిన తత్ప్రచారమెక్కువగా జరుగునని తోచినది.

అందువలన బ్రహ్మేంద్ర పారాయణచరిత్రము జేయు నపుడు కథలో సందేహములేర్పడి కడకాసందేహములు స్వామి కృపవలన బాసి యాగ్రంథము బూర్తి జేసియుంటిని గాన తత్కథతో దీనిని వెంటనేరచించి యొకపర్యాయము మా యాశ్రమముముందు జెప్పించితిని.

అపుడాకథవినినవారు నీకథావిధానము బాగున్నదను టేగాక వెంటనే దీని నచ్చు వేయింపుడని ప్రోత్సహించిరి. అపుడావసతులింకను స్వామి కూర్పలేదు, వారెపుడుకూర్చిన యపుడు ముద్రింతునని జెప్పితిని.

స్వామివారావసతులిప్పటికి సమకూర్చిరి గాన నిపుడు ప్రకటింపబడుచున్నది. దీనిని దామందరు జెప్పించి విని ఆనందించుటేగాక చదివి స్వామివారి కృపకు బాత్రులు కావలయును. ఇదియే విజ్ఞాపనము.

ముద్రణ విషయములో బ్రోత్సహించినవారికి దీనిపై నభిప్రాయము లిచ్చినవారికి దీనికి బోషకాది చందాలొసంగిన వారికి మత్కృతజ్ఞత. వీరినందరిని మాబ్రహ్మేంద్రస్వాముల వారు రక్షించుగాత.

పొరపాట్లు పునర్ముద్రణమున సవరించుకొందును

గ్రంథకర్త.

## మా బ్రహ్మేంద్ర గ్రంథములగుఱించిన ప్రశంసలు

### 1953 ఏప్రిల్ అరుణోదయ సంచిక

1 బ్రహ్మేంద్ర సేవాదర్పణము:— యీగ్రంథము భగవద్భక్తులును, సేవకులును గల ప్రతి మఠమునందును మందిరమునందును ఆశ్రమమునందును వుండవలసిన గ్రంథము ఇందు బ్రహ్మముగారి నామసంకీర్తనము, భజన, ప్రభాతసేవ పూజ సహస్రనామపూజ ఏకాంతసేవలుశ్రీరామబ్రహ్మ గేయములు క్రొత్తపక్కీగా రసవంతముగా వ్రాయబడియున్నవి.

2 బ్రహ్మేంద్ర సంపూర్ణచరిత్రము హరికథ:— ఇందు బ్రహ్మంగారి సంపూర్ణచరిత్ర గలదు. నూతన పక్కీలతో నవరసాలంకారయుతముగా వున్నది. హరికథలు చెప్పువారల కత్యంతోపయుక్తముగా యున్నది.

3 బ్రహ్మేంద్ర పారాయణ చరిత్రము:— పూజాసహితము. ఇందు బ్రహ్మేంద్రస్వాములవారి...చారిత్రపారాయణకుపయుక్తముగా పద్యరూపమున వ్రాయబడినది. ...గ్రంథకర్తగారి కృషిని అభినందించుచున్నాము. సంపాదకుడు

దువ్వూరు కడపజిల్లా జిల్లెళ్ళ వీరబ్రహ్మాచార్యులు

బ్రహ్మేంద్ర సేవాదర్పణములో భక్తునకు నిత్యసేవలో నుపయోగపడు అన్నివిధములైన గేయములు పూజ సులభశైలిలో సుబోధకముగా నున్నవి. బ్రహ్మముగారి భక్తునకు తరించుటకై యీయొకటే గ్రంథము చాలును,

దుబ్బాక మెదకుజిల్లా కాసోజు లక్ష్మణాచార్యులు

అయ్యా! మీరుపంపిన బ్రహ్మేంద్ర సంపూర్ణచరిత్రము హరికథ చేరినది. చూచి చాల ఆనందించితిమి.

తులగాం ;శ్రీకాకుళంజిల్లా పి. సూర్యనారాయణాచార్యులు

# కథకులు

కథ చెప్పుచోట బ్రహ్మముగారి పటమందరికి గనుపడు నట్లున్న తస్థానమున బెట్టింపవలయును.

కథారంభమున సిద్ధిరిక్కా బొందుపరచిన ప్రబోధ గీతముల శాడి స్తోత్రములకు దిగవలయును.

కథ అవసరమునుబట్టి ఒకరోజును రెండురోజులును చెప్పవచ్చును.

రెండవరోజు చెప్పవలసినచో నారోజును ప్రబోధ గీతములను స్తోత్రములను జదువవలయును.

ఇందు కథలోలేని సాంప్రదాయ విరుద్ధ విషయములను మహిమకు భంగముగల విషయములను జేర్చరాదు.

కథ ముగియులోపల రెండుగాని మూడుగాని ఆనంద కరమైన పిట్టకథలను జెప్పవలయును.

సమాధి అయినతర్వాత పై పటముకడ కనీసము 54 దీపములనైన వెలిగింపజేసి పూజ జేయింపవలెను.

నైవేద్యమప్పుడు కనీసము 27 టెంకాయలనైన గొట్టింపవలయును.

నీరాజనమపుడు కర్పూరము వెలిగింప జేయవలయును (కానుకలు వేయుసమయమిది)

పూజానంతరం కొబ్బెరదీయించి ముక్కల జేయింపవలయును. కథానంతరం ప్రసాదమిప్పింపవలయును.

N. B:— పటములేకున్న కలశముబెట్టింపవచ్చును. కథ యింకను విరివి గావలయునన్న మా బ్రహ్మేంద్రనాటకమును జూడవలయును.

ఇట్లు,

గ్రంథకర్త.

ఓమ్

నమోవిశ్వకర్మణే



కృతిపతి:
శ్రీవీరబ్రహ్మము.

గ్రంథకర్త:
శ్రీరామబ్రహ్మము.

శ్రీరామ బ్రహ్మాశ్రమము, పెదకొత్తపల్లి.

ఓమ్

# శ్రీ బ్రహ్మేంద్ర సంపూర్ణ చరిత్రము

## బుఱ్ఱకథ

## ప్రబోధ గీతములు

కథకులు ముందీ ప్రబోధ గీతములు జదువవలయును,

శ్రీ విరాట్ బ్రహ్మేంద్ర స్వాములవారికీ జై
శ్రీ మదాదిశక్తి గోవిందా భగవతికీ జై
శ్రీ మన్మాతా ఈశ్వరీ భగవతికి జై
శ్రీ రామబ్రహ్మ స్వాములవారికీ జై
శ్రీ అన్నాజీ వరద బ్రహ్మేంద్రో హరిః
శ్రీ ఏకాంబర వరద బ్రహ్మేంద్రో హరిః
శ్రీ చిదంబర వరద బ్రహ్మేంద్రో హరిః
శ్రీ సిద్దయ్య వరద బ్రహ్మేంద్రో హరిః
శ్రీ మద్గోవిందాంబికారమణ బ్రహ్మేంద్రో హరిః

అంజవైన నీవేనమ్మవలె

తల్లివైన నీవేనయ్యా! వీరదేవా! కన్న
తండ్రివైన నీవేనయ్యా! వీరదేవా! ॥త॥
గురుడవైన నీవేనయ్యా! వీరదేవా! మఱియు
పరుడవైన నీవేనయ్యా! వీరదేవా! ॥త॥
నేతవైన నీవేనయ్యా! వీరదేవా! సర్వ
దాతవైన నీవేనయ్యా! వీరదేవా! ॥త॥

శ్రీరామ బ్రహ్మాశ్రమవాసా! వీరదేవా! భక్త
శ్రీరామ బ్రహ్మావ్యాయపోషా! వీర దేవా! ॥ త॥

పోవమ్మా బలికావమ్మా వరె

చేయండీ! స్తుతిజేయండీ! భక్తులార! బ్రహ్మేంద్రునిగూరిచి॥చే॥
ఆర్తుల మొరవిని వారిబ్రోవనీ! యవనికి వచ్చినవాడండీ!
అత్యాచార్యుల భోజదంపతుల! నచ్చుమ నేలినవాడండీ ॥చే॥
'నమ్మినవారిని బ్రోతు' నంచులో! కమ్మున జాటినవాడండీ!
'నమ్మకపోతే చెడిపోయ్యేర'ని! నరులకు చెల్పిన ఘనుడండీ॥చే॥
ఆపదలందున మ్రొక్కెడివారల! యాపదలుడిపెడువాడండీ!
ఆయనకన్నను మించినవారలు! అయ్యా! నిజముగ లేరండీ॥చే॥
జరామరణములులేక సమాధిని! జక్కగ గూర్చున్నాడండీ!
పరమకరుణ శ్రీరామకవీంద్రుని! పాలించుచున్నాడండీ॥చే॥

భారతదేశము మనదండోయ్ వరె

బ్రహ్మముగారిని నమ్మండోయ్! భక్తిని సేవలుచేయండోయ్
బహుశాసక్తిని బ్రోవగవచ్చిన! భగవంతుడు నిశ్చయ
మండోయ్ ॥బ॥
పిలిచినపలికెడు వాడండోయ్! ప్రేమనుజూచెడు వాడండోయ్
తలచినమాత్రనె కష్టములన్నియు! దప్పించెడు వాడాతం
డోయ్ ॥బ॥
కలుములనిచ్చెడివాడండోయ్! కాలముదెల్పెడివాడండోయ్
కరమారోగ్యము నాయుష్యంబును! కల్గించెడి వాడాతం
డోయ్ ॥బ॥
కోరువరములిడువాడండోయ్! కోరతలదీర్చెడువాడండోయ్
శ్రీరామబ్రహ్మాశ్రమవాసుడు! శ్రీరామార్చితుడాతండోయ్॥బ॥

జై విరాట్

# శ్రీ బ్రహ్మేంద్ర సంపూర్ణ చరిత్రము

## బుఱ్ఱకథ

## స్తోత్రములు

గీతముల తర్వాత నీస్తోత్రములను జదువవలయును.

శ్రీ మించిన పెదకొత్తపల్లిపుర। సీమాశ్రమవాసా!
హేమరచిత కోటీరవిభూషా। యేకాంబరపోషా!
వీర దేవ! నీకథను రచింపగ। వేడ్కబూనినాడ
సారశబ్దములు సద్భావంబులు। సరగనొసగుమయ్యా!
తల్లిరో శ్రీమద్గోవిందమ్మా! దయనుజూడుమమ్మా!
ఎల్లకోర్కెలను దీర్చుచు నన్నెపు। డేలుచుంటివమ్మా!
పూజనీయమగు నేతద్గ్రంథం। బును జేయగనెంచి
పూతచరిత్రా! నీదు సహాయం। బును గోరితి దేవీ!
ఈశ్వరి! నన్గృపజూడుముతల్లి! ము। నీంద్రకల్పవల్లీ!
శాశ్వతంబుగా భక్తుల బ్రోచెడి। సత్సతీముతల్లీ!
నారసనాంగణమందు 'తధిమ్మ'ని। నటియింపగదమ్మా!
నాయీకృతి బరిపూర్తి జేయ నిను। నమ్మితి నోయమ్మా!
అని బ్రహ్మముగారిని గోవిందమ్మను జగదీశ్వరిని
ఘనమగు భక్తిని సంస్తోత్రంబును। గావించుచుగాక
సమరస భావుని వెంకటేశ్వర। స్వామిని గొనియాడి

విమలహృదయ మాపిచ్చమాంబను। వివిధగతులబాగడి
ప్రిమదంబున శ్రీ శ్రీనివాస గురు। వర్యుని మదినెంచి
పతిసేవా రత భాగీరథమ్మను। బ్రస్తుతిగావించి
తల్లిదండ్రి మాణిక్యాంబార్కయ। దంపతుల నుతించి
ఉల్లమందు మద్గురు వీరేశుని। నొనర బ్రశంశించి
ఆరంభింతును శ్రీమద్బ్రహ్మము। గారి చరిత్రమును
షౌరాయన శ్రీరామశర్మ నా। మాంకితుడగు నేను

వంత:— ఓయీ! యీ బుఱ్ఱకథ కారంభించినది శ్రీరామశర్మ
యంటివి. ఎవరా శ్రీరామశర్మ?

కథకుడు:— ఎవరా?

బ్రహ్మము గారికెన్నడునులేని శిలావిగ్రహ ప్రతిష్ఠ శతా
హ్నిక సంకీర్తన మహాయజ్ఞము అష్టోత్తర శతకళ్యాణములు
లక్షనామపూజ 'కోటి' వ్రాత లోనగు కార్యములు చేయు
టేగాక పెక్కు గ్రంథముల రచించి శ్రీవారి భక్తి ప్రచారము
గావించుచున్న పెదకొత్తపల్లి వాసులు శ్రీరామబ్రహ్మమను
శ్రీరామశర్మగారు,

వంత:— ఓహో! బ్రహ్మేంద్ర మాలగ్రంథము జేయుచున్న
శర్మగారా? తెలిసెను.

కథకుడు:— ఇక గథ కారంభము జేయుదము.

వంత:— సరే కానిమ్ము.

కథకుడు:— (సభ్యులజూచి) అయ్యా! కథ కారంభము
జేయుచున్నాము. ఇక్కథ జెప్పుటలోగల మా తప్పుల
మన్నింప బ్రార్థన.

# కథా ప్రారభము

ఈ కథకు శ్రీమించిన పెదకొత్తపల్లిపుర। సీమాశ్రమవాసా!
అనువల్లవి బాడవలయును.

కథ:- వినుడీ! యావన్మానవులారా! విమల హృదయులారా!
వీరబ్రహ్మస్వాముల చరితము। వినుపింతుమువీాకు
నాలుగు నూర్లకు మించువర్షములు। నాడీదేశమున
చాలగాను దుర్మార్గ వర్తులగు। జనులు వృద్ధిజెంది
భక్తవర్యులను బెక్కువిధంబుల। బాధపెట్టుచుండ
భక్తులు తాళగలేక శ్రీవిరా। డ్భగవంతునిగూర్చి
దేవా! మము రక్షింపుమంచు బ్రా।ర్థింపగశ్రీ వారు
దేవిని గని "ఓతరుణీ! కొన్నాళ్ల్లీ విచ్చటనుండి
అటుపయి పెద్దకొమెర్లలోన కో।టయ్యాచార్యులకు
అనుగుపట్టి వగుమేను గలిసికొం।దుమ"ని చెప్పితాను
ఘన సరస్వతీ తీరకుజము క్రిం।దను శిశువైయుండ
అనఘుం డత్యాచార్యుడు పూలకు।జని కని గొనివచ్చి
వెంట వీరనారాయణుడనెడు వ। విత్రనామముంచి
వేడ్కమీారగ నా పశిపాపను। బెంచుచుండునపుడు.

వంత:- అరేయ్! భూదేవి రాకుండనే పాపభారం మోయ
లేననే ప్రశంశ జరుగకుండనే అంతరెండు మాటలతో
తేల్చేశావేమిటిరా?

కథకుడు:- ఓరీ! బ్రహ్మముగారు భక్తరక్షణకు వచ్చినది
ప్పటి కంత నాల్గువందల చిల్లర సంవత్సరము లే గదా
అప్పుడు 'అచల' యనబడు భూమి స్త్రీయై భూదేవి

పేరున సంచరించినట్లు పాపభారం మోయలేనన్నట్లు
నీ వెప్పుడైన నెవరివలననైన విన్నావా? ఏ చరిత్రలో
నైన చూచావా?

వంత:— లేదు. గానిమ్ము.

కథకుడు:— ఇట్లు త్ర్యాచార్యులు వీరనారాయణ బాలుని తన
యాశ్రమములో పెంచుచుండునప్పు డొక్కనాడు.

మ రా టి ప క్కి

నందికొండలో । నివసింతురైన తంధానాతం ధాన తంధనా
శిల్ప బ్రాహ్మణ। వంశజాతులును ,, ,,
పాపఘ్నీపీ।ఠాధి పతులునగు ,, ,,
వీరభోజయా। చార్యదంపతులు ,, ,,
సంతులేక దుః। ఖంబుననుండి ,, ,,
శ్రీ విరాట్టునా। త్మను ధ్యానించుచు ,, ,,
పుణ్యక్షేత్రము। తెల్ల దిరుగుచు ,, ,,
వచ్చిరి యా భక్త త్ర్యాచార్యుల। వారి జూడనెంచి
తంధానా తంధానాఓ దేవనందనాన॥

వంత:— నందికొండలోని వీరభోజ దంపతులు కాశీలోనగు
క్షేత్రములగాంచుచు అత్ర్యాచార్యులజూడ వానికడకు
వచ్చినారన్నమాట తరువాత?

కథకుడు:— తరువాత.

కథ:—అత్ర్యాచార్యులువారియుదంతము।నంతయుగ్రహియించి
పుత్రహీన దంపతులారా ! యీ। బుడుతను గొనుడనుచు
తనరు వీరనారాయణ బాలుని। తనహస్తంబులతో
అనఘులైన పాపాంబ దంపతుల। హస్తములందుంప
సంతోషించినవారై యత్ర్యా। చార్యుల స్తోత్రించి

అంతబిడ్డతో నందికొండకు। నరిగిరి వారపుడు
ఇవ్విధంబుగ నందికొండకుజని వీరభోజయాచార్య
వీరపాపాంబగారలీ పిల్లవానిని.

కథ:— చక్కగ పెంచుచు 'వీరంభట్ల'ని। సంభోధించుచును
తక్కువేమి మనకింకని కడుమోదంబును పెందుచును
పంచ మాబ్దమురాగానే పాపాంబ మనోహరుడు
అంచితముగ నబ్బాలునకును విద్యారంభము జేసి
సంస్కృతాంధ్రముల బంచశిల్పముల।సరగ జెప్పెనోయీ!
సరియగు కాలంబున నుపనయనము। జరిపియుండెనోయీ!
వేద,శాస్త్రముల యోగ శాస్త్రముల వెంటగరపెనోయీ!
వేదాంతంబును స్వర శాస్త్రంబును। వేడ్క దెల్పెనోయీ!
ఇట్లు తండ్రిగారిచే సకల విద్యాప్రపూర్ణులగు మనవీరం
భట్లయ్యగారు తరువాత కొంతకాలమున కేమిచేసినాడంటే

వంత:— ఏమి చేసినాడు?

కథ:— దేశాటనకును తల్లియనుజ్ఞను। దీసికొనియులేచి
ప్రాశస్త్యంబగు పట్టణంబులను। పల్లెలగాంచుచును
అందందున ధర్మస్థాపన మిం।పొందగ జేయుచును
ఆశ్రితులకు విజ్ఞానబోధన। త్యంత మొనర్చుచును
రామేశ్వరమున కేగి భక్తసం। రక్షణగావించి
అమీాదబయల్ దేరి వచ్చుచు। 'హరిహరపురి' జేరి
అచ్చట నివసింపుచు దత్పురమున। నలరుప్రజావళికి
హెచ్చుప్రేమసంతానాదికముల। నిచ్చుటయేగాక
మహిమలెన్నొ చూపించుచునుండెను।మనుజులుత్సహింప
మతిప్రబోధలను జేయుచునుండెను। మాపు రేపుగూడ
ఇట్లున్న సమయంబునందొకనాడు కాశీపురంబునఆనంద

భైరవుడను క్షత్రియుడు వేటాడ నడవికిబోయి అచట గోవును జంపబోవు పులిని జూచి ఆవును రక్షింప పులికి బాణము వేయ నాబాణము గోవుకు దగిలి యది కూలుటచే తన కేర్పడిన మహాపాపంబు బాయుటకు స్వప్నసూచనననుబట్టి విచారించు కొనుచు 'హరిహరపురి' చేరి స్వామివారిని జూచి నమస్కారములొనర్చి 'దేవా! యిపాపినిరక్షింపుము'నిన

స్వామివారందుకొఅకే యుండిరిగాన "ఓయీ! నీవీ పాపంబుబాయ జన్మాంతమున మహమ్మదీయు లింటబుట్టి సిద్ధనామమున నొప్పారవలయును. తదుపరి నాకు శిష్యుడ వయ్యెదవు. అపుడు. నీవలన కావలసిన కార్యంబుల చెప్పెద ముందిటు రమ్మ"ని

కీర్తన:– పోరా బాబూ పో వలె

ఓయీ! భైరవుడా! నాయష్టాక్షరిను పదేశించెద ॥నో॥

పాయనిభక్తి సదా జపింపుము ॥ఓ॥

సకలపాపసంచయము గూలును। సకలరోగములు సమసి పోవును

సకలభూత ప్రేతములు నసించును। సకలోపద్రవములు హరించును ॥ఓ॥

సకలపుణ్యములు వృద్ధిగాంచును। సకలశుభంబులు విస్తరించును

సకల భోగములు సంప్రాప్తించును। సకలవాంఛితంబులు సిద్ధించును ॥ఓ॥

అని "ఓనమో వీరదేవాయ" యను అష్టాక్షరీమహా మంత్రోపదేశం బొనర్చి ప్రతి యాదివారము నా పూజజేసి కొనుచుండుమని పూజాక్రమంబు చెప్పి ఇక వెళ్లుమని పంపి

స్వామివారచటనుండి బన్గానపల్లెకు బోయెను.

వంత:— వీరంభట్ల స్వామివారు ఆనందభైరవునికి జన్మాంతమున మహమ్మదీయులింట బుట్టవలయుననియు సిద్ధనామమున నొప్ప వలెననియు జెప్పి మంత్రోపదేశంబొనర్చి పూజాక్రమంబు దెలిపి పంపించి బనగానుపల్లెకు వెళ్ళినాడంటివి. అటనెవరింటికి జనెను? ఏమిజరిగెను?

కథకుడు:— అచటనా?

కథ:— గరిమరెడ్డి అచ్చమ్మగారి మం।దిరమునకునుజనియె
మరియును వీరప్పయ్యనామమున । మహితకీర్తిగాంచె
ఆమెగారిగోగణపాలనమిం।పార జేయుచుండె
ఆచలముపైనను గాలజ్ఞానము।నమర వ్రాయుచుండె
అచ్చమకనవచ్చియు వేదోక్తన మం।త్రాదులవచియించె
అన్నాజయ్యకు కాలజ్ఞానము। ననువుగవినుపించె
అచ్చమాంబకట్టించిన మఠమున। నన్నాజిని నిల్పె
అయమగారికి జెప్పగదలచిన।దంతయుబోధించె
కాలజ్ఞానము భక్తకోటి కొఱ।కై కొలదిగనుంచె
కడమదంతయును గచ్చుపాతరను।గట్టియందుబెట్టె

వంత:— అరేయ్! స్వామివారు లోకోపకారమునకు రచించిన కాలజ్ఞానములు పాతరబెట్టుటకు నేమికారణమురా?

కథకుడు:— ఓరీ! ఆ కాలజ్ఞానములు స్వామివారు వీరభోగవసంతరాయులుగా వచ్చువరకు పనిలేదుగనుకను, ఇప్పటి వారి బుద్ధులెరుంగుటచే విడిగానుంచిన చేర్పులు మార్పులనేకము జరుగుననియును పాతరనుంచిరి.

వంత:— అందుకా పాతరబెట్టినది. సరే ఇక గానిమ్ము.
కథకుడు:— బ్రహ్మముగారు.
కథ:— అంతట నల్లాడ్పల్లె జేరితా । క్షాళిగాచుచుండె
అటుపిమ్మట కొన్నాళ్లకు 'దుప్పాటి'పురంబు జేరె
ఆటగల ప్రజలకు వీరధర్మములి నవ్వారిగ జెప్పె
అవల కందిమల్లయ్య పల్లియకు। నలఘుప్రేమవచ్చె.
వంత:— ఇప్పటికి స్వామివారు నందికొండ, బన్గానపల్లె
అల్లాడుపల్లె దుప్పాటు వాసములు పూర్తియై కంది
మల్లయ పల్లెకు వచ్చినవారు. సరే తదనంతరము?
కథకుడు:— తదనంతరము.
కథ: ఆపురంబునసె వీరప్పయగా । రధిక ప్రీతితోడ
కాపురంబు శ్రీ వీరబ్రహ్మ। ఖ్యను జేయుచునుండి
పౌరవర్యులకు సల్పుచునుండెను। బంచశిల్పములను
పరగనందరికి నన్యోన్యంబుగ। వరలుచుండెనండీ!
ఈ విధినుండి వివాహంబాడగ। హృదయమందు నెంచె
గోవిందాంబను బెండ్లిజేసికొన। బోవనిశ్చయించె.
వంత:— ఓయూ! గోవిందాంబను పెండ్లి జేసికొన బోవనిశ్చ
యించి నాడంటివి. ఈమె విరాట్ప్రభునాజ్ఞచే పెద
కొమెర్లలో కోటయాచార్యుల కనుగుపట్టియైన
కన్యకా రత్న మేగదూ?
కథకుడు:— ఔను.
వంత:— ఐన నీమెగారి విశేష మేదేనిచెప్పుము.
కథకుడు:— ఏదో యెందుకు? ఈమెకొరకు తలిదండ్రు లెందరినో
వరులనుదీసికొనిరాగ "మీారునా కేవరులనుదీసికొనిరా

వలదు నాకువచ్చువరుండిక మూడు రోజులనాటికి తనకై తానురాగలండని సూచించియుండెను. అట్లే బ్రహ్మముగారు వివాహమాడబోయిరి.

వంత:– ఓహో! ఈమె సామాన్యురాలు కాదే.

కథకుడు:– కాదు ఇక నీమహాతల్లియుక్క రూపు రేఖా విలాసములను గుఱించి యించుక చెప్పెదవినుము.

వంత:– కానిమ్ము.

కథకుడు:–

కీర్తన: కమాచిరాగము ఆదితాళము

గోవిందాంబికా! రూపు వర్ణింప దరమ ॥గో॥
ఆవిలాసిని ముఖము। రేవెలుంగునకు సమము ॥గో॥
కలికిలోచనములు। కమల సన్నిభములు
పాలతినాసపారు।తిలపుష్పంబునకు మీరు ॥గో॥
చేడె కర్ణములు। శ్రీకారంబులనొంచు
చెలియకుంతలములు। ఆలిసంఘంబునుహాసించు ॥గో॥

వంత:– గోవిందాంబ యిట్టిసుందరీమతల్లియన్నమాట. సరే! తరువాత నేమి జరిగెను?

కథకుడు:– తరువాత నింటికి వచ్చిన స్వామివారినిజూచి గోవిందమ్మగారు వీరే నాభర్తయని తలిదండ్రులకు సూచింప తండ్రి సంతోషించి సుముహూర్తము నిశ్చయించి

కథ:– శుభలేఖల దమ మిత్రవర్యులకు। జుట్టాలకు వ్రాసి అభిరతి సున్నంబును దెప్పించి గృ।హాముసకు గొట్టించి పందిళ్ళను బెట్టించి తోరణాల్।వరుసగ గట్టించి

పరమ గుణుడు కోటయ్యాఖ్యుడు సర్వము సిద్ధము
జేయ తన్మహూర్తమున

మ రా టి ఫ క్కి

బంధు మిత్రులోకప్రక్కదనరగ తంధానాతం ధాన తందనా
పౌరజనములోకవైపునుండగ ,, ,,
సర్వవాద్యములు జరుగుచుండగ ,, ,,
నిగమజ్ఞులు మంత్రములు పల్కగ ,, ,,
ముత్తైదులు హారతులనియ్యగ ,, ,,
వినవారు చదివింపుల జేయగ ,, ,,
పెద్దలెల్ల రాశీర్వదింపగ ,, ,,
బ్రహ్మము గోవిందాంబను వేడ్కవివాహమాడినాడు
తంధానా తంధానా ఓ దేవనందనాన

వంత:- ఈవిధముగా బ్రహ్మముగారి వివాహమయ్యెను.
తరువాత నేమి జరిగెను?

కథకుడు:- తరువాత

కథ:- ఏ తద్గుణవతితోడ కాపురము నింపుగ జేయుచును
ఎల్లవారలకు సామాన్యనిగతి వృత్తులొనర్చుచును
శ్రీవీరేంద్రుండుండగ బురిలో జిన్నపెద్దలెల్ల
పావనియగు పోలేరిశ్కొల్పునకు ప్రారంభము జేసి
గ్రామంబున జందాలవసూలను గావించుచునుండి
స్వామివారి చందాజమగామికి చాలగ కోపించి
వీరేశ్వరు నిటుతోడ్కొరమ్మని వెట్టినివానిబంప

వంత:- గ్రామాధికార్లు లోనగువారు పురము కడనుండి
బ్రహ్మముగారిని దోడ్కొనిరమ్మని వెట్టివానిని బంపి

రన్న మాట. తరువాత

కథ:- వెంటలేచి శ్రీ వీరబ్రహ్మము। వెళ్ళెపురము దరికి
అచ్చట వీరిని జందానిమ్మని। యందరొత్తుచుండ
తెచ్చియిచ్చుటకు లేదనియెంతో।దీనతబల్కుచును
బయిటికిరమ్మన పోలేరప్పుడు। బాలికయైరాగ
బదులిడుమమ్మా! పైకంబనుచును। బల్కుచుండగాను
సరసనున్న వారీమహిమకు విస్మయమనస్కులగుచు
సారజ్ఞా!తమసామ్మువలదుమము। సత్కృపగనుడనుచు
వరుసనుతింపగ దేవినంపి యు।వ్వారిగటాక్షించి
తిరిగి వీరగురుండింటికి వచ్చెను। దేలుచుమోదమున

వంత:- ఓయీ! పోలేరి విగ్రహమురాయిగదా! ఈరాయి
బాలికగా నెట్లయ్యెను?

కథకుడు:- దీనికే యాశ్చర్యపడుచుంటివా? ఇట్టిమహత్తు
లింకను యనేక మనేక మున్నయవి.

వంత:- సరే తరువాత?

కథకుడు:- తరువాత వీరభగవానుడు

ఓ భా ర తీ యు డా! వ లె
ఈ మ ట్టు కు

శ్రీపోతులూర్వీర । గురుడు చేసినపనులు । ఓ పుణ్యజనులార!
వినరయ్య! అనునది పల్లవి

భక్తసంఘంబునకు। బరిపూర్ణకరుణతో
బ్రహ్మోపదేశం బొ।నర్చాడు రెండవసారి
ఏకాంబరాది శిష్యవ్రాతమునకు నె
న్నెన్నియో ధర్మములు।జెప్పాడు ,,

సత్యంబహింసలను। సామరస్యముగూర్చి
జాతిజాతికిబోధ। సల్పాడు ,,
త్రివిధకాలజ్ఞాన। దివ్యప్రచారంబు
దినదినం బనురక్తి।జరిపాడు తం.
జారచోరత్వములు। జూదాలు త్రాగుళ్ళు
జనులచే విడిపింప। జేశాడు ,,
పరగ వేదాంతంబు। ప్రజలకుద్బోధింప
పాఠశాలొకదాని। బెట్టాడు. ॥శ్రీ పో॥

ఇంకను,

చూపుబోయినవారు। స్తోత్రంబుగావింప
చూపువారి కనుగ్ర।హించాడు ,,
కుష్ఠురోగులను జాక్కనిరూపులుగ జేసి
గొప్పవాడనుకీర్తి। గొన్నాడు ,,
గ్రహబాధలను దీసి। వేసియవ్వారలకు
కరము సౌఖ్యము బ్రసా।దించాడు ,,
స్వరశాస్త్రమును యోగ।శాస్త్రంబుగాని యాడు
సాధురత్నంబులకు। దెల్పాడు ॥శ్రీ పో॥
ఇవన్నియుగాక నొకానొక సమయంబున మాదరంబున
కాలసర్పము కఱచి,। కాలధర్మమునొందు
కాపు బాలకుని బ్రతికించాడు ,,

వంత:— ఓరోరీ! యిదేమిటిరా! చచ్చినవారిని బ్రతికించునటరా?

కథకుడు:— ఓరీ! సంకల్పమాత్రమున సమస్తసృష్టి గావించు మహానుభావులు బ్రతికించుటలో నాశ్చర్యమేమున్నది?

వంత:— సరే! తరువాత కథ జెప్పుము.

కథకుడు:— తరువాత బ్రహ్మముగారు
పెక్కుపట్నాలలో। బ్రియమైనవారలకు
నొక్కసారిగ గాను।పించాడు ,,
కోరు రూపంబులను।కోరువారికి జూపి
వారి కానందంబు। గూర్చాడు ,,
పుణ్యభూములకేగి। భళిభళీ
దేవతాళిని గాంచి। భళిభళీ
పూజలెన్నో జర్పి। భళిభళీ
ముడుపులెన్నో గట్టి। భళిభళీ
సంతానమును లేక। చింతించువారలకు
సంతానఫలముల నొ।సంగాడు ,,
సభలందు నెన్నెన్నో। మహిమంబులనుజూపి
సన్మానశతముల గ్ర।హించాడు ॥శ్రీ పో॥
ఇట్లు జరుగుచుండ క్రమముగ
సిద్దిలింగార్యుని। భళిభళీ
గోవిందస్వామిని। భళిభళీ
శివరామయాఖ్యుని। భళిభళీ
ఓంకారమయ్యను। భళిభళీ
పోతులూరయ్యను। భళిభళీ
గాంచుచేగాకుండ। నారాయణమ్మనెడి
కాంతామతల్లిని ।బడశాడు ॥శ్రీ పో॥
వంత.— ఓరీ! బ్రహ్మముగారి కుమారులలో గిరిరాజయ్య అను
వారుండవలయునే వారి పేరేదిరా?
కథకుడు:— బ్రహ్మముగారి కుమారులలో గిరిరాజయ్య అను

వారు వేఱుగలేరు వారిలో నొకరినీ పేరున బిలుతురు

వంత:— అహాఁ, ఇక గానిమ్మ.

కథకుడు:— జ్యేష్ట పుత్రుండై న। సిద్దిలింగాభిదుని
చెలగితాతకు పెంపు। నిచ్చాడు ,,
కడమసుతులకు సంస్కృ। తాంధ్రాదివిద్యలను
కరతలామలకముగ। నేర్పాడు ,,
శిల్పశాస్త్రంబులను। యోగశాస్త్రంబులను
జేరివారికి ప్రబో।ధించాడు ,,
వివిధ ధర్మంబులను। బ్రవచించు టేగాక
వేదాంతమును నూరి। పోశాడు ,,
వీరందరికిని గా।న్యకల నన్వేషించి
వేడ్క పెండ్లిండ్లు గా।వించాడు ,,
పాఠశాలకు వీరి। నధ్యాపకుల జేసి
పరమహర్షంబుతో। నున్నాడు ॥శ్రీ పో॥

ఇట్లు స్వామివారు సంతోషాంతరంగుడై యుండుసమయంబున నొక్కనాడుదయము యెనిమిది ఘంటలవేళ భార్యాపుత్ర సహితంబుగ నర్ఘ్య పీఠంబుల నలంకరించి భక్తులకుజ్ఞానంబు నుదోబ్ధింపనున్నతరి గోవిందాచార్యులు లేచి తండ్రిగారికి నమస్కరించి భగవంతా! మాకీరోజున కాలజ్ఞానములోని ముఖ్యవిషయంబుల బ్రవచింపుమాయనికోర బ్రహ్మముగారే మనుచున్నా రనగా

కీర్తన: రా ర భా ర తాం బ వ లె

వినుఁడి కాలజ్ఞాన। మఖిలపౌరులారా!
తనయులార! శిష్యా।జనులారా! ప్రియమునిూర ॥వి॥

కనగ వెన్కజరుగు। గాధలుండెగాని
కలిభవిష్యములను। దెలుపు గ్రంథములులేవు ॥వి॥
సరవిభక్త కోటి। చదివిబాగుపడగ
సంకల్పంబును జేసి। చాలగ వ్రాసి యుంటి ॥వి॥

వంత;— ఓరీ! కాలజ్ఞానమనుమాట నేబహుకాలమునుండి వినుచున్నాను. ఏవి? దానిలోని ముఖ్యవిషయము లించుక జెప్పుము.

కథకుడు:— వినుమీ కలియుగము సుమారైదు వేల సంవత్సరములకు

కథ:— భారత దేశములోపలనుత్తమ। వైశ్యకులమునందు
ఆరాధ్యుండగు శ్రీమద్గాంధిమ। హాత్ముండు బుట్టొందు

వంత:— కాలజ్ఞానము వ్రాసిన దెప్పుడు? గాంధిపుట్టిన దెప్పుడు? ఓరీ! యిట్టి నిదర్శనములుండుటచేత నేరా! ప్రజలు స్వామివారి వాక్యముల మోఘములంటారు పిమ్మట?

కథకుడు:— పిమ్మట.

కథ:— మంచినీళ్ళజోతులు వెలింగెడి। మాటనిశ్చయంబు

వంత:— మంచినీళ్ళజోతులేమిటిరా?

కథకుడు:— అవియేక రెంటు దీపాలు

వంత:— ఓహో! సరిపోయినది తరువాత?

కథకుడు:—

కథ:— లంచంబులను గడించెడిమానవ। సంచయంబుబెరుగు
వృషములులేకను బరువులెత్తు బం। డ్లేగు దెంచుముందు

వంత.— వృషములు లేని బండ్లేమిటి?

కథకుడు:— వృషములనగా నెద్దులు అవి లేని బండ్లు రైళ్లు

కాగ్గులోనగునవి

వంత:– సరే! అనంతరము?

కథకుడు:–

కథ:– వెంపలిచెట్లకు దోట్లువేయువా। ర్వారివిగజనియింత్రు
మాలమాదిగలు మర్యాదనుగను। కాలంబరుదెంచు
బాలనాయకత స్త్రీనాయకతను। బహునాయకతగును

వంత:– బాలనాయకత స్త్రీనాయకత బహునాయకతలనగా
నేమిటి?

కథకుడు:– బాలనాయకత యనగా బాలభట నాయకత్వము
స్త్రీనాయకతయనగా స్త్రీలనాయకత్వము బహునా
యకతయనగా బహుజన నాయకత్వము అనగా
మెంబర్ల నాయకత్వమన్న మాట

వంత:– సరే! పిమ్మట?

కథకుడు:– పిమ్మట

కథ:– కన్నతల్లులు గరళంబౌటయె। ఖాయంబనుకోండి!
కొన్నభార్యలు బెల్లంబౌదురు। కోర్కెమీరవినుడీ!
కన్యావిక్రయ ములనేకంబుగ। కాగల వంతటను
అన్యాయాక్రమ వర్తులు పుట్టెద। రతిశయమొప్పగను
ముండమోపులు ముత్తైదులుగా। భువిలోనయ్యెదరు
ఖండితంబుగా క్షుద్రమతంబులు। గల్గివృద్ధిబొందు
వావులుక్రమముగ దప్పిపోవును। వాస్తవంబుగాను
వర్ణాశ్రమధర్మంబులన్నియు। వరుసగ జెడిపోను
భార్యాభర్తలకును విరోధముల్। బలముగ నేర్పడును
బాసలు జేయదయార్ద్రయుందురు। ప్రజలు దేశములను

ఇవ్విధంబుగ జెప్పుచుండ గోవిందమ్మగారు మనోహరా! తమకటాక్షము నొంద నొక భక్తుడూరిముందరికి వచ్చు చున్నాడు. గాన కొన్నిముఖ్యాంశములజెప్పిసరి పుచ్చుడన సతీ! యట్లేపూర్తి జేసెదనని స్వామివారేమనుచున్నారనగా

కథ:— కుల గోత్రంబులు లేక వివాహం॥బులుజరుగునునింక

ఇలలోపల రూపాయలుగాలికి॥ నేగుమాటనిజము

వంత:— ఓయీ! కులగోత్రములు లేక వివాహములు జరుగును రూపాయలుగాలికి బోవునంటివి. వీని గురించి వివరింపుము.

కథకుడు.— కులగోత్రములు లేక వివాహములు జరుగుననగా నవివర్ణాంతర వివాహములు, అనగా మొన్న రాజ గోపాలాచారి గాంధిగార్లుచేసిరే అలాంటివే.

ఇకరూపాయలుగాలికి బోవుటెట్లనగా వానికిబదులు నోట్లువచ్చునుగాన గాలికిబోవును.

వంత:— తరువాత?

కథకుడు:— తరువాత

కథ:— పరగనారుమతములవారికి సా॥పాటులమరునయ్యా!

ప్రాజ్యంబైన ప్రజానుమతిగల, స్వ॥రాజ్యంబగునయ్యా!

వంత:— ఓరీ! ఇట్టి స్వరాజ్యము మొదలగు విషయముల జూచినట్లుచెప్పుటకు స్వామివారికెట్లు తెలియునురా?

కథకుడు:— వారు త్రికాలవేత్తలు. ఇకవారికి దెలియని దేమున్నది? కావుననే వారిని సర్వజ్ఞుడనిరి.

వంత:— సరే కానిండు.

కథకుడు:— ఈ విధముగా బ్రహ్మముగారు భక్తులకు బోధ

జేయుచుండు సమయంబులో

తొల్లి హరిహరపురిలో వీరంభట్లయ్యాయను వీరిచే మహాత్మ్యదీయులింట బుట్టొందనాజ్ఞబొందిన కాశీవాసుండగు నానందభైరవుడు ఆజన్మాంతమున ముడుమాలలో పీరుసాహేబు ఆదంబిదంపతులకు బుత్రుడై సిద్దయ్య యను నామమున నలరారుచు బ్రహ్మముగారి పఠము బెట్టుకొని స్నేహితుల గూడి

కీర్తన: తియ్యానివెన్నెలహాయిని వలె

వీరబ్రహ్మ స్వాములవారి। భజనము జేతాము ।మనము।
భజనము జేతాము ॥వీ॥
కరతాళంబుల జేతన్‌బట్టి। కాళ్ళకుగజ్జలుగట్టియు। కంజీర
వాద్యయుతముగ। దాంబుర శృతిసహితముగ। ॥వీ॥
జై జై గోవిందాంబికేశ! యని।జై జై పరమేశా!యని
భోజేంద్రనందనా!యని। భూలోక పాలకా!యని ॥వీ॥
ఆనందం బ్రహ్మానందంబని। ఆనందాంబుధి దూగుచు
అఘములనుబాపుమనుచు। అనుకంప జూడుమనుచు ॥వీ॥
అని ఇవ్విధంబుగ భజనజేసి కొనుచుండ

మరాటీ ఫక్కి

తండ్రియైన పేరా। పీరుసాహేబు తంధాన...
తద్భజనంబును। జూచినవాడై ,,
కొమరునిపై, కోపంబుదెచ్చుకొని ,,
పండ్లు పటపట। గొరికి కొనుచును ,,
ఓరీ! భ్రష్టా! యీభజనేమిటి? ,,
మనమతంబునకు। దగినదేనయిది? ,,
ఎన్నాళ్ళిటునే। జూచువాడను ,,

నిన్నూరక నే। విడచిపెట్టను। నిశ్చయంబుసిద్ధా!
తంధానా తంధానా ఓ దేవనందనాన॥

వంత:— ఓరీ! పీరుసాహెబు సిద్దయ్య మీదికి తోకద్రొక్కిన త్రాచువలె లేచినాడు గదరా!

కథకుడు:— ఔను! ఇక నాదంబి తనూభవుని జేరదీసి,

వంత:— ఏమనుచున్నది?

కథకుడు:— ఏమనుచున్నదా?

పైచాయవలె

తనయా నావా। క్యములాలింపుము తంధాన...
తండ్రిచేత జీ। వాట్లు దినకుము ,,
సత్పుత్రుఁడవని। దలచితి కుఱ్ఱా! ,,
కులమున గన్యాత। బోయెతనూజా! ,,
మన మతంబున నె। నిలుపుకుమూరా! ,,
హిందూ మతము ప। నేమి? నాయనా! ,,
నాహితంబు గ్రహి। యింపుము తండ్రీ! ,,
నాకు బ్రియము జేకూర్పుము బిడ్డా! ప్రాకటంబుగాను
తంధానా తంధానా ఓ దేవనందనాన

అని యీవిధంబుగా తలిదండ్రులు చేయుబోధవిని సిద్దయ్య

వంత:— సిద్దయ్యయేమనుచున్నాడు?

కథకుడు:— ఏమనుచున్నాడా?

కథ:— తల్లిదండ్రులారా! నేజెప్పెడి। దాని వినుండికను
తనరెడుసృష్టికి మూలమైదుభూ। తంబులౌనుగాదా
తదూద్భూతములకు మతభేదములు య। దార్థంబుగగలవా?
తలపగవానికి లేనిభేదములు। గలిగెనెట్లుమనకు?

కావుననుభయ మతంబులుమది నొ।క్కటిగా భావించి
భూవలయంబున సంచరించు టే। ముఖ్యవిషయమగును
అనిసిద్దయ తలిదండ్రులకును బో। ధనుగావింపగను
జనకుఁడోరి! మాకేహితోపదే।శంబు జేతువటరా
ఏ దుష్టుండే క్రూరుడుచేసెర। యిట్టిబోధ నీకు
ఆ దుర్మార్గుని తుత్తునియలుగా। ఛేదించెదనిపుడు
అనియుపీరుసాహేబుపల్క సి।ద్దయ్య జనకునిగని
వనజమరందము గ్రోలగ నెవ్వడు। భ్రమరమునకు దెల్పె
వంత:— అరేయ్! "వనజమరందము గ్రోలగ నెవ్వడు
భ్రమరమునకు దెల్పెన"న్నావె వనజమరందము
భ్రమరము యేమిటిరా?
కథకుడు:— వనజమరందము=తామరపూదేనె, గ్రోలగ=దానిని
త్రాగుమని, భ్రమరము=తుమ్మెదకు, నెవడు దెల్పె=ఎవడు
దెల్పినాడన్నమాటరా!.
వంత:— సరె ఇకగానిమ్మా.
వేడుకమావిచిగుళ్ళుమెక్క కో।వెలకు నెవడునేర్పె
దాడిమవిత్తులదినగ జిల్క కె।వ్వాడు ప్రబోధించె
దైవభక్తి తద్రీతిగ నెవ్వడు। తండ్రీ! తెల్పవలెను?
నీవుకూడ యోచింపుము నిక్కము।నీకు తేటపడును.

అని సిద్దయ్యబల్క పీరుసాహెబు కుమారునిజూచి ఓరి దుర్మతీ! చెప్పి చెప్పి విసుగుబుట్టినది. నీ దుంపనెగ్గిన ద్రెంచుకో అని భార్యనుజూచి "సతీ! వీడిముఖము జూడగూడదు. మన యింటికి బోవుదమురమ్మా"అని యిరువురు నింటికిబోవ సిద్దయ్య తోడిబాలురజూచి 'బాలులారా! స్వామివారు రాత్రికలలో

గన్పడి తమసన్నిధానమునకు రమ్మని చెప్పిరి. గాన నేను వెళ్ళెదను. మీరిల్లె నిచట నిత్యసేవల నెరవేర్చుచుండు డ'ని చెప్పి దేవదేవుండగు వీరదేవుని కృపగల్గినదింకేమని సంతసించి మనస్సునుద్దేశించి,

కీర్తన: కమాంచిరాగం ఆదితాళం

పోదముపదవే మనసా ॥వేగ॥

పోతులూరి వీ। రేంద్రుని సేవకేక ॥బో॥

ఆశ్రితరక్షకు। వచ్చినవాడె।అత్ర్యాచార్యుల।కడనున్నాడె
ఆనందముభో।జునికిడినాడె।అచ్చమ్మనుగడ। తేర్చినవాడె ॥పో॥
పాపులబుద్ధుల। మార్చినవాడె।భక్తుల పరిపా।లించినవాడె
భూపులసన్ను తు।లొందినవాడె।పాంతకురమ్మని।పిలిచినవాడె॥పో॥

N. B:- వలయునేని యీ చరణముల తిరిగి మిత్రగా పాడ వచ్చును.

అని సిద్దయ్య మనసునకు బోధచేసికొనుచు బయలుదేరి పలుగురాళ్ళపల్లె సోమిరెడ్డిపల్లె దాటి కంది మల్లయ పల్లెజేరి జగద్గురుండగు వీరగురుని సమీపించి శ్రీవారి పాదపద్మముల మీదబడి

తే॥గీ॥ సకలలోక సంరక్షక। శరణు శరణు
సగుణ నిర్గుణరూపక। శరణు శరణు
సంయమీంద్రమనస్థిత। శరణు శరణు
సత్వరూప! మహేశ్వర। శరణు శరణు

అని సాష్టాంగ నమస్కారముల గావించి శ్రీవారిభార్యయగు గోవిందమ్మగారికి కుమారులగు గోవిందాచార్యాదులకు మ్రొక్కి వారి దీవనలబొంది బ్రహ్మముగారి ముందునిలిచి

కథ:- స్వామీ! చిన్నతనంబున నుండి భావద్భక్తినిగల్గి
నామభజనముల నేనొనరించుట। నాతలిదండ్రిగని
వలదీభజనల మానుమటంచును। పట్టుబట్టినన్ను
గలతబెట్టుతరి తాము ప్రియంబున। గలలోగనుపించి
'నాసన్నిధికిక రమ్మా' యననీ। నాడువచ్చినాను
భాసురమగు దమపాదపద్మముల। బాసిపోవ నేను
పరమకృపాకర! యచ్చమాంబకవ। వర్గమిచ్చినట్లు
పురుషసింహా! యేకాంబర యోగికి। ముక్తినూర్చినట్లు
మునిజనరక్ష! చిదంబరునకు సాన్మోక్ష మొసగినట్లు
వనజదళాయతనేత్ర! నాకు గైవల్యమీగదయ్యా!

వంత:- అని సిద్దయ్య యనేక విధంబుల వేడుకొన వీరా
చార్యుండు 'సిద్దా!యిప్పుడు నీవు చెప్పినదంతయు నాకు
దెలియును. మీతలిదండ్రులు సామాన్య మానవులు.
నీవు కారణజన్ముడవు నీ జన్మవృత్తాంతము నీవలనగావల
సిన కార్యక్రమము తర్వాత చెప్పెద. ముందు నీవుగోరి
నట్లు మోక్షమార్గములో బ్రవేశింప జేసెద న' ని
కుమరుల జూచి కుమారులారా!

మీరీసిద్దని మన వేదాంత పాఠశాలలో జేర్చి యుపదేశమునకు
ముందు గ్రహింపవలసిన విషయమును జెప్పుడు. నేను తక్కినది
పూర్తిజేతునన సరేయని కుమారులు సిద్దని పాఠశాలలో
జేర్చి తొల్త పెద్దకుమారుండును విజ్ఞానాగ్రేసురుండును
అచలగురుండును పూజనీయుండునగు గోవిందాచార్యులు
చేయు బోధయెట్లనిన

వంత:- అరేయ్! బ్రహ్మముగారి కుమారులు సిద్దయ్య యుఫ

దేశమున కసర్హుడని కరవాలములతో బైకి దుముక వలెగాని బోధచేయు టేమిటిరా?

కథకుడు:— ఓరీ! అట్లుదుముకుటకు వారజ్ఞానులుగారు వారు లోకోద్ధారకులు మహానుభావులు నగుదురు. వారి చరిత్రలోకసారి విందువులే

వంత:— సరే కానిండు.

కథకుడు:— అప్పుడు గోవిందాచార్యులు సిద్దని జూచి

మరాటి ఫక్కి

సిద్దా!గుణశ్రేష్ఠుండగువాఁడు తంధానా తంధాన తందనా
పెద్దవారి సేవించెడువాఁడు ,, ,,
తత్వబోధ కాశించెడువాఁడు ,, ,,
గురునాజ్ఞను దలదాల్చెడువాఁడు ,, ,,
శాంతిదాంతులను గల్గెడువాఁడు ,, ,,
శాస్త్రసమ్మతిగ నడిచెడువాఁడు ,, ,,
అభిమానము దెగగోసినవాఁడు ,, ,,
బ్రహ్మవిద్యసముపార్జనజేయగ బాత్రుండగునయ్యా! ॥తం॥

వంత:— అట్టివాఁడా? బ్రహ్మవిద్యకర్హుడు. సరె

కథకుడు:— ఇఁక శిష్యలక్షణము వినుము

సిద్దా!శిష్యుడు దివసమున ప్రథమతః గురునిదర్శించు నపుడు సాష్టాంగ నమస్కారము జేయవలయును. గురుడే సాక్షాత్పర బ్రహ్మమని సదాభావింపవలయును. గురుభక్తిలేనిచో ముక్తి దూరమగును. దేహమున్నంతవరకు గురుని మరువగూడదు గురునాజ్ఞబొందనిది యుపదేశము జేయరాదు. గురునిస్నానాం గాది శుశ్రూషల దృష్టి జేయవలయును. ఇందును గురించి

పూర్ణబోధ మతాలోకసమయమున జేతును. ఇంక నా సోదరుఁడు శివరామాచార్యులు కొన్నిసంగతులు చెప్పునని విరమింప

రెండవ కుమారుండును వీరధర్మ ప్రచారకుండును యోగాచార్యుండును విద్వద్వరుండునగు శివరామాచార్యులు లేచి సిద్ధనిజూచి

కీర్తన: శ్రీరాగము ఆదితాళము

ఆదంబీనుతా! వినర! భూతోత్పత్తి విధము ॥నా॥

ఆదరంబుగల విశ్వకర్మయను। నట్టి దేవ దేవుని ప్రభావమున

నాదినిశబ్దగుణంబునుగల్గిన।యాకాశంబుజనించియుండెనుర ॥ఆ॥

తదుపరినాయాకాశమునకుశ।బ్దంబుస్పర్శమనునటువంటి మహత్తరగుణద్వయంబున నొప్పారుస। దాగతిప్రభవంబై యుండెనురా ॥ఆ॥

అనంతరము నాయొక్క మారుతం। బునకు శబ్దమును స్పర్శము రూపంబనెడు మూడుగుణములతో జేరిన ।యగ్నిసముద్భవమైయుండెనురా ॥ఆ॥

తనరారెడునాజ్వలనమునకుశ।బ్దంబును స్పర్శము రూపంబురసంబనునాలుగు గుణములతోగూడిన।ఘనరసంబుజన్మించియుండెనుర ॥ఆ॥

క్రమముగనాయుదకంబునకును శ।బ్దము స్పర్శము రూపము రసంబుగంధమనునై దుగుణములతో నమరిన। ధారుణియుత్పత్తైయుండెనురా! ॥ఆ॥

అయ్యా! ఇది పంచభూతోత్పత్తి క్రమము. వీని కలియికచే

సర్వచరాచరములు గల్గెను. ఇఁక మానవ ప్రమాణమును గుఱించి వినుము

మానవ ప్రమాణము:— 7 జేనలపాడవు. 4 జేనలవలయము 33 కోట్ల రోమంబులు 72 వేల నరములు 66 ఎముకలు 92 కీళ్ళు 33 మూళ్ళ పేగు 1 సేరుగుండె 1 మణుగునాల్గు సేర్ల మాంసము 1 సోలపైత్యము. ఇఁకమా సోదరుఁడు ఓంకారాచార్యులు కొన్ని సంగతులు చెప్పునని చాలింప.

మూఁడవకుమారుండును వేదాంతశిరోభూషణుండును కాలజ్ఞానధురీణుండును మహిమాఢ్యుండునగు, ఓంకారాచార్యులు లేచి సిద్దా!పిండోత్పత్తిని గుఱించి చెప్పెద వినుమని తద్బోధ గావించు టెట్లనగా.

వంత:— ఏదీ? మూడవ కుమారుఁడైన ఓంకాచార్యుల బోధ వినిపింపుము.

కథకుడు:— వినుము.

కథ:— తినుయాహారం బేడుదినములకు! దే నరీతిగనగు
అనువుగ నారస మేడు దినములకు!నయ్యా! రక్తమగు
ఆరక్తముమఱి యేడు దినములకు!నోరి! మాంసమగును
ఆమాంసం బేయేడు దినములకు! నో మేధస్సుగను
ఆమేధస్సే యేడు దినములకు! నస్థిరూపమగును
ఆయస్థియె నిఁక నేడు దినములకు!నోయి!మజ్జయగును
ఆ మజ్జయె శుక్లంబు శోణితము!లగు వారమునకును
ఇట్టిశుక్ల శోణితములు సతీపతులు కలియు వేళ నేకీ భవించి

కథ:— ఓరీ! సిద్దా! యైదుదినములకు! నీరుబుగ్గ యగును
ఆబుగ్గయె యగుబది దివసంబులు!కయ్యా!రక్తముగను

ఆరక్తముమాంసపు ముద్దగు బదు। నై దురోజులకును
ఆముద్దయె యిరువది దినంబులకు। నగును గట్టిగాను
మఱియద్దానికె యొకనెలలోపల। మస్తకమేర్పడును
రెండవనెలలో జేతులు కాళ్లు। సృష్టిజరుగునోయీ!
మూఁడవనెలలో మజ్జయుశల్యం। బులును గల్గునోయీ!
నాల్గవనెలలోనవయవములుపూ। ర్ణతనుబొందునోయీ!
ఐదవనెలలోనోరునాసికము। నఖంలమరునోయీ!
ఆరవనెలలోగళము కుక్షి యను। నట్టివి సమకూడు
ఏడవనెలలో సక్రమంబుగ। నెఱుక ప్రభవమౌను
అష్టమమాసంబున నాయెఱుక యె। యతిశయిల్లుమిగుల
నవమాసంబున నాపిండము పత। నంబగుభూమిపయి

అనియివ్విధంబుగ ఓంకారాచార్యులు బోధించియిక మాసోదరుడు పోతులూరాచార్యులు చెప్పునన

నాల్గవకుమారుండును పరిపూర్ణబోధాచార్యుండును పండితోత్తముండును పరమభక్తుండును నగు పోతులూరాచార్యులేమను చున్నాడనగా

వంత:— ఓరీ! ఓంకారాచార్యులు జేసిన బోధకూడ సామాన్యమైనది కాదే, తరువాత కానిమ్ము.

కథకుడు:—

సిద్దా! సాధన చతుష్టయ సంపత్తిని గుఱించి వినుము

సాధనచతుష్టయమనగా

నిత్యానిత్యవస్తువివేకము
ఇహాముత్రార్థ ఫలభోగవిరాగము
శమాది షట్కసంపత్తి

ముముక్షుత్వము నగును.

ఇందు 1 నిత్యానిత్యవస్తు వివేక మనగా
బ్రహ్మము నిత్యము ప్రపంచ మనిత్యమని తెలిసికొనుట
2 ఇహాముత్రార్థఫలభోగ విరాగమనగా
ఇహాభోగ ములను వమనాన్న మూత్రపురీషముల
వలెజూచుట
3 శమాది షట్కమనగా
శమము దమము ఉపరతి తితీక్ష శ్రద్ధ సమాధానము లనునవి 6
వానిలో
శమమనగా: అంతరింద్రియనిగ్రహము
దమమనగా: బాహ్యేంద్రియనిగ్రహము.
ఉపరతియనగా: త్యజించినవస్తువును గ్రహింపకుండుట.
తితీక్షయనగా: సన్మానము వచ్చిన నవమానము వచ్చిన
నోర్చియుండుట.
శ్రద్ధయనగా: గురువునందు బ్రహ్మమునందు భక్తిగల్గి
యుండుట
సమాధానమనగా: గ్రంథములందు జెప్పిన సంగతులు
గురువు చెప్పిన సంగతులొక్కటేనని
దృఢమనస్కుడై యుండుట
4 ముముక్షుత్వమనగా
సద్గురుని కొరకెదురుచూచుచు. మోక్షాపేక్ష గల్గియుండుట
యనివిరమింప
సిద్దయ్య గురుపుత్ర చతుష్టయమును జూచి
కీర్తన: భారత దేశము మనదండోయ్ వలె

పీరగురు ప్రభుసుతులారా! విశ్వజనస్తుత గుణులారా!
విమలజ్ఞానదురంధరులారా! పీరధర్మసంస్థాపకులారా! ॥పీ॥
చక్కనిబోధనొనర్చితిరయ్యా! సంతోషంబునుగూర్చితిరయ్యా!
పెక్కుబోధలిక జేసియునను మీ।బిడ్డమాదిరిగ జూడుండయ్యా
॥పీ॥
మీపదంబులకు మ్రొక్కెదనయ్యా!మిమ్ముసదాభజియించెదన
య్యా!
మీ రేనన్నుసమస్తవిధంబుల।వృద్ధికై కొనిరావలెనయ్యా॥పీ

అని సిద్దయ్య గురుపుత్రుల స్తోత్రించునపుడు బ్రహ్మము గారి కడ సిద్దయ్యయున్నాడని తెలిసికొని పీరుసాహేబురాగ బ్రహ్మముగారు పీరుసాహేబు పాఠశాలకు వచ్చిరి. తత్సమయంబున పీరుసాహేబు సిద్దనిజూచి

వంత:— ఏమంటున్నాడు? పీరుసాహెబు.
కథకుడు:— ఏమంటున్నాడా,
కథ:— ఓరీ! తనూభవ! నీకొరకై నే।నూరూరులుతిరిగి
భూరి కష్టములు పడి పడి పడి ని।న్నేరితి నిప్పటికి
రారాతండ్రీ! రారాతనయా! రారానాబిడ్డా!
రారాపుత్రా!యింటికిబోదము।రయముగానుమనము
నీవుగానబడమిని మీతల్లి।నిరుపమ దుఃఖమున
లేవలేదురా! జాలముసేయక।లేచిరార! యనుచు
పీరుసాహెబు పల్కగ సిద్దయ।ప్రియమున తండ్రిగని
మీరలు తండ్రీ! నన్నుగుఱించి వి।చారపడగ నేలా?
మీయిష్టంబువచ్చిన రీతిగ।మీరలుండుడయ్యా!
మాయనాటకముపై నాకెప్పుడు। మమతకల్గదయ్యా!

గురుకటాక్షమున దరియింపగనిటు।కున్ వచ్చితినయ్యా
తిరిగిరానుముమ్మాటికి నింటికి।మరలిపోవుమయ్యా!

అన పీరుసాహెబు కుమారునిజూచి అయ్యా! కుమారా! నీకొరకు పిల్లను మాటాడితిని గదరా! పెండ్లాడిబాగుపడరా! యనిపల్క సిద్ధయ్యవినమి నికలాభములేదని నిరుత్సాహపడు పీరుసాహెబును బ్రహ్మముగారుచూచి "పీరుసాహేబూ! నీ కుమారున కేవిధమైన లోపంబులేదు. రెండు మూడురోజులలో! నింటికివచ్చును. పగళ్లు మీ కులవృత్తి జేయుచు మిముపోషించును. రాత్రులు మాకడకువచ్చి మాబోధలు గ్రహించును. పెండ్లి కూడయగును. నీవికబొమ్మ"న పీరుసాహేబు సిద్ధనివప్ప జెప్పిపోవ స్వామివారు సిద్ధనిజూడ సిద్ధయ్య మహాప్రభూ! తమ కుమారులనేకము బోధలగావించిరి. ఇక దమయుపదేశమున కెదురుచూచుచున్నానని కేలుమోడ్చి

భుజంగ ప్రయాతము

రాగము: కానడ

నమోభక్తకల్పమ్ న।మో నిర్వికల్పమ్
నమోచిత్స్వరూపమ్ న।మో సుప్రతాపమ్
నమోరత్నభూషమ్ న।మో రమ్యవేషమ్
నమోవిశ్వదేవమ్ న।మో వీరదేవమ్.

రాగము: బిలహరి

శ్లో॥ శ్రీమన్మేరునగాధిపమ్ శుభకరమ్।జీవాంతరంగస్థితమ్
బ్రహ్మేశానముకుంద సన్నుతపదమ్।భక్తౌఘసంరక్షకమ్
నీరేజాప్తహిమాంశుబింబనయనమ్।నిర్వాణసంధాయినమ్
పాపారణ్యదవానలమ్గుణయుతమ్। బ్రహ్మేంద్రదేవంభజే॥

కీర్తన: కలవరమాయె మదిలో వలె

శ్రీ బ్రహ్మేంద్రస్వామీ! ఓస్వామీ! ఓ స్వామీ!
ఆ బ్రహ్మేంద్రముఖ్యుల బ్రోచు।అన్నాజయ్యాభక్తనిగాచు॥శ్రీ॥
నాలోనున్న తుచ్ఛగుణంబుల। నయముగ దీసి వేయండీ!
చాలగాను ప్రార్థించెదునాకు। జ్ఞానభిక్షనిక బెట్టండీ! ॥శ్రీ॥
కారుణ్యాతిశయమౌన సమున।గని మోక్షంబు నొసంగండీ!
కాలజ్ఞానము దెల్పినన్ను నిక్కంబు గధన్యుని జేయండీ! ॥శ్రీ॥

అని సిద్ధయ్య యనేక విధంబుల స్తోత్రింప బ్రహ్మముగారు కరుణాకటాక్షవీక్షణుండై మంత్రోపదేశము జేయనెంచి చేర దీసి చూచి

కథ:- తారకమంత్రము వినరా సిద్ధా! ధన్యుడవౌదువురా!
కోరిక తచ్చైతన్యపు వెలుగును। కుఱ్ఱా!చూడుమురా!
ఆరుమూయబడునట్టిషణ్ముఖీ।యనెడుముద్రగనరా!
అందువినంబడు దశనాదంబుల। నాలింపంగదరా।

యని సిద్ధనికి స్వామివారు వీరతారక మంత్రోపదేశంబొనర్చి వెలుగును జూపి షణ్ముఖీముద్రను బట్టించి అందు క్రమముగ ఝిణినాదము ఝిణిఝిణినాదము మేఘనాదము భేరీనాదము మృదంగనాదము తాళనాదము శంఖనాదము ఘంటానాదము వీణానాదము వేణునాదము అనుదశవిధనాదములు వినబడును. తదనంతరమానాదంబులేకమై యొక్క ప్రణవనాదమె ఘోషించును. తన్నాదము వినుమని చెప్పి ఇంక సాంఖ్యముగూర్చి యించుక బోధింతునని,

బిడ్డా!

జ్ఞాత, మనస్సు బుద్ధి చిత్తము అహంకారము లనునవి 5

ఇవియే యంతరింద్రియములు ఆకాశతత్వములు
సమాన వ్యాన ఉదాన ప్రాణ అపానంబులనునవి 5
ఇవియే పంచప్రాణములు వాయుతత్వములు
శ్రోత్ర త్వక్కు చక్షు జిహ్వా ఘ్రాణంబులనునవి 5
ఇవియే జ్ఞానేంద్రియములు అగ్నితత్వములు
శబ్ద స్పర్శ రూప రస గంధములనునవి 5
ఇవియే జ్ఞానేంద్రియ విషయములు ఉదకతత్వములు
వాక్కు పాణి పాద పాయు ఉపస్థలనునవి 5
ఇవియే కర్మేంద్రియములు పృథివితత్వములు

మొత్తమీతత్వములు 25. ఇందేతత్వమెచ్చోటనుండి యేమి పనిచేయుచున్నది తర్వాత జెప్పెదను. ఇఁక నీవింటికి బోయి ప్రతినిత్యము పగళ్ళు మీ వృత్తి జేసికొనుచు రాత్రులందిచ్చటికి వచ్చుచు మాబోధలు చక్కగా గ్రహించుచుండవలయునని పూర్తి జేసి యివ్విధంబుగా జరుగుచుండ నప్పుడొకనాడు బ్రహ్మముగారు

ఓ భారతీయుడా! వలె

పశ్చిమదేశంబు। సంచారమొనరింప
భక్తాళితో పయన।మైనాడు
పోయి పోయి పోయి। బళ్ళారి పురమునకు
మోదావహంబుగను। జేరాడు
తరువాత కర్నూలు। పురికి బ్రవేశించి
ధరణీశు సభలోని। కేగాడు
అతఁడశ్వగర్భస్థ। పిండమేదియో చెప్ప
మనగ మగపిండమని। జెప్పాడు

తత్పిండమునుదీసి। సభ్యవరులకు జూపి
తదుపరి గర్భమున। నుంచాడు
వంత:- ఓరీ!అశ్వగర్భస్థపిండము మగపిండమని చెప్పుట తత్పిండ
మును దీసి సభ్యులకు జూపి మరల గర్భమందుంచుట
గొప్ప విషయములుగదరా!
కథకుడు:- ఔను.
వంత:- తరువాత ?
కథకుడు:- తరువాత
పరహార్షోత్కర్ష। మున నాన్నృపుండొసగు
పారితోషికమును ।బొందాడు ॥శ్రీపో॥
మఱి పుష్పగిరిలోన భళిభళి
సద్గురావిప్రులకు ,,
మహిమా విశేషములు ,,
గనుపింపగా జేసి ,,
ఆ విప్రవరులిచ్చు। బహుమతులగై కొనియు
నంత స్వపురమునకు। వచ్చాడు ॥శ్రీపో॥
వంత:- ఓరీ! ఈవిధముగా బ్రహ్మముగారు పశ్చిమ దేశ సం
చారంబు ముగించుకొని కందిమల్లయపల్లెకు వచ్చినా
డన్నమాట. సరే తరువాత?
కథకుడు:- తరువాత కొంతకాలము జరుగ నొకనాడు స్వామి
వారు సిద్ధనికి
కూర్మాసన కుక్కుటాసన పద్మాసన వీరాసన హలాసనాది
యాసనంబుల నెఱింగించి.
అండాండము అనగా కనుగ్రుడ్డు

పిండాండము అనగా పాపయనెడు బిందువు
బ్రహ్మాండము అనగా వెలైడు కళ
యని అండ పిండ బ్రహ్మాండముల గుఱించి చెప్పి
ఇంక షడ్చక్రబోధ జేయదలంచి సిద్దా! మనలో

మూలాధార స్వాధిష్టాన మణిపూరక అనాహత వి శు ద్ధ ఆగ్నేయ సహాస్రారములను చక్రములుగలవు. వానికధిపతులు క్రమముగ వినాయక బ్రహ్మ విష్ణు మహేశ్వర జీవ సదాశివ పరమాత్మలనువారు గలరనుచుండ కక్కయ చాటునుండి విని నిజముగ నాయా దేవతల నాయాస్థానంబుల జూడ నెంచి యింటికి వెళ్ళి

దుః ఖ ర స ము

కథ:- తంధానా అయ్యయ్యో తంధానా ఓ దేవనందనాన
కక్కయ కత్తిని బట్టినవాడై। అయ్యయ్యో
కాంతనిద్రనుండ తంధానా...
కాలిచప్పుడేమియు జేయక నా। అయ్యయ్యో
కాంత కడకు జేరి తంధానా...
మూలాధారము మొదలుకొనియును। అయ్యయ్యో
పూనిశిరముదాక తంధానా...
చీలిచి సురులట లేకపోవగా। అయ్యయ్యో
చెలువ చచ్చిపోవ తంధానా...
అప్పుడు పెండ్లమ! పెండ్లమ! పెండ్లమ! అయ్యయ్యో
యనుచు నేడ్వసాగె తంధానా...
అవ్యక్తపు పని కావించితినని। అయ్యయ్యో

అత్మనుదలపోసె తంధానా...
హా! కులసతి! నాకికదిక్కెవరని। అయ్యయ్యో
అతడు గొట్టుకొనియె తంధానా...
లోకములో బ్రతికేమి సుఖంబని। అయ్యయ్యో
లోనలోన గుమిలే తంధానా...
దేవతలను గన నెంతజేసితని। అయ్యయ్యో
భావమందు నెంచె తంధానా...
శ్రీ వీరేంద్రునిమాట నమ్మగద। అయ్యయ్యో
చెడితినంచుదలచె తంధానా...
వారికడకుజని విన్నవింతునని। అయ్యయ్యో
దారిబట్టిపోయె తంధానా...
భోరున నేడ్చుచుస్వాములవారికి। అయ్యయ్యో
ముందు తట్టునిలిచె తంధానా...

వంత:- ముందునిలిచి యేమనుచున్నాడు?

కథకుడు:- ఏమనుచున్నాడంటే

కీర్తన: -నాదనామక్రియ ఆదితాళం

దొరా! వీరబ్రహ్మం!నామొుగ। బిరానవినుమయ్యా! ॥అయ్యా॥
సిద్దయకిప్పుడు। చేయబోధవిని। చీల్చితిసతిచ। క్రాధిపతులగన॥దొ
చక్రాధిపులట। లేకపోవగా।జచ్చెనాలియిక।నాగతియేమి? ॥దొ

అనియిట్లు కక్కడు స్వామివారిని ప్రార్థింప

మ రా టి ఫ క్కి.

స్వామి వెంట నే। లేచెరా! సై
మాదిగవాడకు। వెళ్ళెరా! సై
తచ్ఛవంబును। గాంచెరా! సై

కక్కని రమ్మని। పిలిచెరా! సై
లోని దేవతల। జూపెరా! సై
అవలచీలికల। గల్పెరా! సై
తనహాస్తంబున।దుడిచెరా! సై
ఆపడతిని।బ్రతి। కించెరా! సై

భళాభళానోయి తమ్ముడా! సై దేవభళానోయ్ దాదానా

వంత.— బ్రహ్మముగారు కక్కనిభార్యను బ్రతింకించెను. ఆ తరువాత నేమి జరిగెను?

కథకుడు:— ఆ తరువాత కొంతకాలమునకు సిద్దయ్య సిద్దవటములో నవాబు దర్బారున నల్లరాతికి నమస్కరించి దాని సహస్రశకలంబుల జేసిన మహాత్మునకా నవాబు సంతసించి యింక నీతని గురుమహాత్మ్యమెంతకలదో చూతమని బ్రహ్మముగారిని దోడ్కొనిరా మంత్రినంప బ్రహ్మేంద్రుడంతకుక్రితమె యుత్తరదేశసంచారంబు జేయు తలంపుననున్నవాడు గనుక నందుకుసమ్మతించి మంత్రినంపి శిష్యులతో బ్రయాణమై సిద్దవటము జేర యానవాబు వీరికిదగుమర్యాదలజరిపి కొల్వుకూటమున నున్నతాసనమునగూర్చుండ జేసి సాష్టాంగ నమస్కారములొనర్చి యనేక ప్రశ్నలవేసి జవాబులగొన్న మీాద

వంత:— నవాబు బ్రహ్మముగారితో నేమనుచున్నాడు?

కథకుడు:— నవాబు స్వామీా!

కథ:— భూతలమందున నీయెకమానవ। జాతియెకటియేన?
సీతలహృదయా! భేదంబున్నదా?। చెప్పునిజంబనిన

జననాథాగ్రణి! యావన్మానవ। జాతియొకటియేను
కనుఁగొన భేదంబిసుమంతయు లే। దని బ్రహ్మము పలుక
అటులైనను తామిప్పుడు మావిం। దారగింపవలయు
అనఘా!యని ధరణీశుఁడు గోరవు। తాధిపుఁడిట్లనెను

వంత:- ఓరీ! నబాబు విందారగింపవలయునన. బ్రహ్మము
గారందు కేమి సమాధానము జెప్పుచున్నారురా!

కథకుడు:- ఏమి చెప్పుచున్నారనగా

ఇలపతీ! లోకములో గోజాతి వ్యాఘ్రజాతి అశ్వజాతి వలె మానవజాతి యొకటనుట సత్యేతరముగాదు కాని, ఆహార భేదమునుబట్టి మాంసాహారులని శాఖాహారులని రెండు తెగలుగనయ్యెను. ఇందొక తెగవారి కొక తెగవారికెప్పటికి
భోజనములు లేవు.

కథ:- కావుననే భుజియింపగ దగదో। భూవర! మీయింట
నీవుకోరినది ముందుజనలకు। నేర్పడు నిక్కముగ
రాజా! నామహిమంబుగనగ కో। రైకయున్నట్లేని
భోజనమిటు తెప్పింపుమటంచన। భూపతి తెప్పింప
పటముగప్పుకొని తెచ్చిన పళ్ళెము। పై జలమునుజల్లి
ఫలపుష్పంబులుగా గావించెను। బ్రహ్మము భోజనము

వంత:- ఓరీ! బ్రహ్మముగారు భోజన పదార్థములన్నియు
ఫలపుష్పంబులుగా జేసెనుగా బలె! బలె!! ఆపైన

కథకుడు:- ఆపైన నవాబుగారొసంగిన బహుమతులవడసి
వాని ప్రార్థనచే నుపదేశంబొనర్చి శిష్యులగూడి అట
నుండి హైదరాబాదు మీదుగ సీతాచలమువరకు
ధర్మప్రబోధంబుల జేయుచు జని, తిరిగి తూర్పు దేశ

క్షేత్రములగు కలకత్తా జగన్నాధం విశాఖపట్టణం విజయవాడ కనుపర్తి నెల్లూరు తిరుపతి కంచి. మొదలగు పురంబులనిల్చుచు ధర్మస్థాపనము జేయుచు నగరపాటికి వచ్చి అందుజగ్గరాజునకు బుత్రుండుబుట్ట వరంబిచ్చి మఠము జేరిన యనంతర మొకనాడు కుమారుల జూచి

వంత:— ఏమనుచున్నాడు?

కథకుడు:— కుమారులారా!

ఉ॥ పాపులనెల్ల సత్వగుణ।వర్తులజేసితి భక్తులొందు సం
తాపము దీర్చి వారికిము। దంబొన గూర్చితి ధర్మభోధచే
బ్రాపుగ మానవాళి నొక।వాలుకు దెచ్చితి శిష్యులోక వి
జ్ఞాపన మాలకించి కరు।ణన్ బరికించితి మోక్షమిచ్చితిన్

కథ:— కనుక నింక నే జేయుగవలసిన। కార్యంబులు లేవు
అనువుగ నీవై శాఖ శుద్ధదశ।మిని సమాధియాౌదు
పుత్రులార!మీా రీకార్యంబును। బూర్తి జేయుడయ్యా!
పూలు రేపటికి గొనిరావె సిద్దా! పో బనగాన్పురికి

అని స్వామివారు సిద్దని పుష్పములకు బంప సిద్దయ్య సింహ శరభ శార్దూల మాతంగ భల్లూక మర్కటేత్యాది మృగ భీకరంబును, తాల తమాల రసాల తక్కోల వట బిల్వ నింబ జంబీ రాది వివిధవృక్షభరితంబునగు నడవికి బోవుచు మార్గ మధ్యంబున వర్షము బెబ్బులిరాగ నవి గురునిమహిమ వచ్చిన వని గ్రహించి కాపురూపున వచ్చి మాటాడువానిసై తము స్వామి వారేయని తెలిసికొని స్తోత్రింప తద్గురుండు నిజ రూపంబున బ్రత్యక్షమై

మ రా టి ఫ క్కీ

శిష్యా! యిప్పుడు|గురిసినవర్షము తంధానా తంధాన తంధనా
కనుబడినట్టి|ఘనశార్దూలము ,, ,,
నావలనన్ గ|ల్గినవే యిట్టి ,, ,,
దృశ్యంబుల నీ|కున్ జూపుటకే ,, ,,
ఈప్రయాణమును|బెట్టితి నీవు ,, ,,
నేసమాధిబొం|దిన యనంతరము ,, ,,
రమ్ముకొరవలను|జెప్పిపాదుకల ,, ,,
బెత్తము లోనగునవి యొసంగి పం|పెదను ప్రేమనిన్ను

తంధానా — తంధానాఓ — దేవనందనాన

అను స్వామి వారి వాక్యములకలరి సిద్దయ బన్గానపల్లెకు బోయెను.

ఇక నిక్కడ నాదశిమి యాది వారోదయమున బ్రహ్మముగారు గజోత్సవంబుతో లేచి

కథ:— మేళతాళములు సకలవాద్యములు|మిన్నుముట్టుచుండ
బాళిభక్త సముదాయమునతుల|ర్పణము జేయుచుండ

వంత:— బలే! బలే! ఆపైన

మేటినబాబులు పరమహర్షమున| బాటదీయుచుండ
దాటిగ పండితవర్యులు జయశ|బ్దములు పల్కుచుండ
వారక విశ్వబ్రాహ్మణముఖ్యులు| స్వస్తిచెప్పుచుండ
పౌరవరులు మంగళహారతులిం| పారనిచ్చుచుండ
విరిబోణులు శృంగారభామినులు| వేశ్యలాడుచుండ
కరుణారసమునవారలందరిని| గనుచుమఠముజేరి
గోవిందాంబను పిలిచి కొడుకులకు| గోడంద్రకునీవు

భావంబలరగ సుప్రబోధలను। బల్కుచుండుమనియు
అధిక ప్రీతితోగోవిందాచా। ర్యాదుల రావించి
అయ్యలార! నాయొక్క ప్రబోధల। నాశ్రితవర్యులకు
జేయుచుండు డనిచెప్పి వీరనా। రాయణమ్మగాంచి
ఆ యమ్మను స్త్రీలోకమునకు ధ। ర్మాళి దెలుపుమనెను
అంతట శ్రీజగదీశ్వరమ్మను। జెంతకు జేర్చుకొని
సంతసమున బోధల భక్తులకును। సల్పుచుండుమనెను
ఆవల ప్రజల విలోకించియు నో। యఖిలజనములారా!
ఆపదలందున నన్ను నమ్మికొను। డభిరతి బ్రోచెదను
నను నాభక్తుల దూషించెడుదు। ర్జనులు చెడుదురయ్యా!
అనయము ననుసేవించువారు ధ। న్యాత్ములగుదురయ్యా!
అని యివ్విధముగ నింటివారలకు। నాస్థలమున నున్న
జనులకువచియించియు నానందం। బున సమాధియయ్యె.

వంత:- ఓరీ! బ్రహ్మముగారు సమాధియగుటకు గృహము కడనుండి మఠమునకు బోవు మహోత్సవములో సకల వాద్యములు మిన్నుముట్టుట, భక్తులు నమస్కారములుచేయుట, నబాబులు బాటదీయుట, పండితవర్యులు జయశబ్దముల బల్కుట, విశ్వబ్రాహ్మణులు స్వస్తి చెప్పుట, పౌరులు మంగళహారతులిచ్చుట, వేశ్యలాడుట జరిగెనంటివి. ఆహా! యెంతవైభవ మెంత వైభవము.

కథకుడు:- నిజము. ఇవ్విధముగా బ్రహ్మముగారు జీవసమాధి కాగ కుమారులు పైన మూతపలకల బిగించి వేదిక

నిర్మించి అందుపై నిత్తడి శిరస్సును బ్రతిష్టించి దీపం
బుల వెలిగించి పూజకారంభించి నానావిధ పరిమళ
పత్రపుష్పములతో సహస్రనామపూజ గావించి
వందలాది టెంకాయలగొట్టి, గంటల వాయించుచు
అవసర నైవేద్యమును మహానైవేద్యమును బెట్టి
కర్పూరము వెలిగించి నీరాంజనమిచ్చి
ప్రదక్షిణపూర్వక సాష్టాంగ నమస్కారములొనర్చి
శ్రీ విరాట్పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వాములవారికి జై
శ్రీ విరాట్పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వాములవారికి జై
శ్రీ విరాట్పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వాములవారికి జై
-౽ జయశబ్దములబల్కి చేతులెత్తి యిట్లుప్రార్థించిరి.

వంత:- ఎట్లు?

కథకుడు:-

కీర్తన: ఓ పల్లెటూరి పేద రైత వలె

శ్రీస్వామివీర దేశికేంద్ర! చక్కగామముగాంచు మోయయ్యా!
నీవె మాసర్వస్వమంచు।నిక్కముగను నమ్మికొని
నీపదారవిందములకు। నిత్యసేవ జేయుచుంటిమి ॥శ్రీ॥
మాదుకష్టములను హరించి।మాకు శుభములను గ్రహించి
మేదినీస్థలినుండి మమ్మే।మాడ్కిగంటివో యట్టులేనిక ॥శ్రీ॥

తరువాత నాసాయంతనమునకు సిద్దయ్య మందార నాళీక
పున్నాగ కుందాది నానావిధ పరిమళ పుష్పముల దీసికొనివచ్చి
గోవిందమ్మగారిని గోవిందస్వామివారిని జూచి
కథ:- అమ్మా! గోవిందమ్మా! గోవిం।దాచార్యస్వామీ!

అభివాదంబులు మీ పాదంబుల। కాచరింతుగానుడు
అని సాష్టాంగ నమస్కారంబుల। నాతండొనరించి
అయ్యగారి గారిమోత్సవంబు దివ్యంబుగ జరిగినదా?
స్వామి బోధవిన ప్రజలఖండమును। జయదెంచినవారా?
సాధురత్నములు చేసెడు పూజలు।చక్కగ జరిగినవా?
భ్రమతోవచ్చిన పండితవరులకు।బహుమతులందినవా?
భక్తసమారాధనములు మిక్కలి।బాగుగనయ్యెగదా?
అని యివ్విధముగ నవ్విశేషములు।నన్నియు తెలిసికొని
తన రారెడు గురు జీవసమాధిని। గన నచ్చటకేగి

అర్చనగావించిన శిరస్సునుజూచి ఆనందించి సమాధిచుట్టు
ముమ్మారు ప్రదక్షిణములొనర్చి

రాగము: ముఖారి

ఉ॥ వీరగురూ! నమస్సు పృథి।వీజనరక్షక! కేలుమోడ్పు సం
సారవిదూర! వందనము। సాధునుతా!యభివాదనంబు బృం
దారకవంద్య! తావక పాదద్వయికిన్ నిరతంబు సల్పు నన్
జేరగరావె, నీకరుణ। జిల్కవెనాపయి జేజెనాయనా!

వంత:- అరేయ్! బ్రహ్మముగారు జీవసమాధియైన తర్వాత
వచ్చిన సిద్ధయ్య 'గురూ!నన్నొంటరిగా జేసిపోతివా?
నాకు దిక్కెవర'ని భోరున దుఃఖింపవలయునుగాని
నమస్కారములు చేయుట నన్జేరగరావెయని స్తోత్రిం
చుట యేమిటిరా?

కథకుడు:- ఓరీ! సిద్ధయ్యభోరుననేల దుఃఖించును? అతడుపరి
పూర్ణుడుగదా! పరిపూర్ణునకు దుఃఖముగలదా? అగ్నికి

జడులున్నదా?
వంత:- లేదు ఇకగానిమ్ము
కథకుడు:- అప్పుడు సిద్దయ్య
కీర్తన: (శ్రీ)తులసీ ప్రియతులసీ వలె
వీరహారీ! వృజినహారీ! వేగరాగదే
వేగరాగదే
కారుణ్యరసంబుతోడ। గాంచరాగదే
గాంచరాగదే ॥వీ॥
నీ దివ్యాజ్ఞను శ్రీబన। గాన్పురి జేరి
నీరజముల మల్లెపూల। గోసి తెచ్చితి ।వీ॥
పారిజాత సుమముల మం।దారపుష్పముల జాజుల
గోరంటకుసుమముల గ।న్నేరు పూలదెచ్చితిని ॥వీ॥
రాగము: శివరంజని
తే॥గీ॥ లలిముఖాబ్జము చిరునవ్వు।లొలుకుచుండ
హారములు కంఠమందల్ల। లాడుచుండ
కనకవసనము బెత్తము। గ్రాలుచుండ
వీర దేవ దర్శనమీయ। వేగరమ్మ.
దండకము
రాగము——నాదనామక్రియ
శ్రీమన్మహా దేవ! గోవిందమాంబామనోవల్లభా! భక్తకల్పద్రుమా! పాపజీమూత ఝుం ఝూనిలా! వారిధిగంభీర! వేదాంత బోధ స్వరూపా! జగజ్జాల నిర్మాణమూర్తీ! త్వదీయాజ్ఞనా నా విధానూన పుష్పంబులన్ దెచ్చి నీకై ప్రతీక్షించుచుంటిన్ దయా దృష్టినిన్ దర్శనం బిచ్చి నన్ ధన్యునిన్ జేయ వెన్వెంట

రారమ్మా బ్రహ్మేంద్రనామా! గుణస్తోమ! శిష్యౌఘధామా
నమస్తే నమస్తే నమస్తే నమః

అని సిద్దయ్య స్వామివారి ననేకవిధంబుల బ్రార్థింప స్వామి దయామయుడై సమాధివద్ద నిలువ సిద్దయ్య సాష్టాంగ నమస్కారములొనర్ప బ్రహ్మము దీవించి

ఓరీ! తొల్లి నీవు క్షత్రియ కులంబులో బుట్టిన ఆనంద భైరవుడను వాడవు. నాడు గోహత్య నొనర్చిన కారణమున నాయాజ్ఞ నిపుడు ముడుమాలలో నాదంబి పీరుసాహేబు లకు బుట్టి సిద్దనామమున నొప్పారుచుంటివి. నాభక్తి ప్రచారము నాకాలజ్ఞాన ప్రబోధము నావీరధర్మ సంస్థాపనము నీవలన గావలసిన కార్యములు. నేను విరాట్టును ఇదిగో నా విశ్వ రూపంబుజూడుమని చూప సిద్దయ్య యానందించి చేతులెత్తి

రాగము: శివరంజని

క॥ నీవ జగజ్జనకుండవు
నీవ జగద్రూపుడవు వ!నీపక వినుతా!
నీవ జగత్పూజ్యుండవు
నీవ జగన్నాయకుడవు! నిజము మహేశా!

యని నమస్కరించి
పూలమూట నూడదీసి.

త:- పూజకారంభించినాడా యేమి?

థకుడు:- ఔను.

వంత:- సరే కానిమ్మి.

కథకుడు:- పుష్పముల స్వామి పాదములపై బెట్టుచు :

రాగము — శివరంజని

సీ॥ ఆ- వాహనమునీకు। సచ్చిన్మ మఠవాస!
సింహాసనమునీకు। జీవరక్ష!
అర్ఘ్యపాద్యములు నీ।కన్నాజి పరిపాల!
స్నానంబునీకు బ్ర।శాంతరూప!
వస్త్రోపవీతముల్। వాసవార్చితపాద!
గంధాక్షతలు నీకు।గంబుకంఠ!
సుమ పూజనీకు న।స్తోకయశస్సాంద్ర!
ధూప దీపములివే।దోషభంగ!
తే॥గీ॥ ఘననివే దనమిదె సర్వ।కలుష హార!
విడమిదే నీకు గొనుము గో।విందజనక!
మంత్ర పుష్పము నీకిదే। మాన్యశీల!
ప్రణుతులివెనీకు నేకాంబ్ర।భక్తవరద!

అని పూజపూర్తి జేయ స్వామివారు "సిద్దా! నీవీ విభూతి పండును -పాదుకలను బెత్తమును దీసికొని యింటికిబోయి నను బూజించు కొనుచుండుము. నీకు సంతానమేర్పడును కీర్తిగల్గును" అని చెప్పి తాము గర్తమున బ్రవేశించిరి.

శ్రీమద్గోవిందాంబికారమణ బ్రహ్మేంద్రోహరిః

తర్వాత సిద్దయ్య యింటికి బోవుచు,
వంత:- ఇంటికి బోవుచు నేమనుచున్నాడు?
కథకుడు:- ఏమనుచున్నాడా?

కీర్తన: ప్రేమకోసమై వలలోబడెనె వలె
ధన్యుడ ధన్యుడ ధన్యుడనైతిని। ధన్యుడనైతినిగా ఆహా!

బ్రహ్మముప్రక్కకు రమ్మనిపిలిచెన్।బరగమంత్రముపదేశించెన్
బరగ మంత్రముపదేశించెన్ నను।బరిపూర్ణునికృపగావించెన్॥ధ॥

అని ప్రజలను జూచి

ప్రజలారా! మీరందరునిజముగ।బ్రహ్మముగారిని నమ్మండీ!
బ్రహ్మముగారినినమ్మండీ!మీరు। పరమసౌఖ్యములబొందండీ॥ధ

అని యింటికి బోయెను.

మంగళహారతి

నీనామరూపములకు వలె

శ్రీమద్గోవిందమాంబ। జీవితేశమంగళం
క్షేమాతిశయము లిచ్చు। చిద్విలాసా! మంగళం ॥శ్రీ॥
శతకళ్యాణములనొక్క। సారే జేయించుకొనిన ॥శ్రీ॥
లక్షనామార్చనము సత్య।టాక్షమునగావింపజేసిన ॥శ్రీ॥
కోటి నామములవ్రాత ।కొనసాగించినతండ్రీ! ॥శ్రీ॥
శ్రీరామ బ్రహ్మహృదయ।సీమవాసుండవైన ॥శ్రీ॥

తే॥ గీ॥ మంగళంబిదె బ్రహ్మేంద్ర। మాన్యనీకు
మంగళంబిదె గోవింద। మాంబనీకు
మంగళంబిదె యీశ్వరీ। మాతనీకు
మంగళంబిదె భక్తస। మాజమునకు

ఫలశ్రుతి

క॥ ఇవ్వసుధ నీచరిత్రము
నెవ్వారలు వ్రాసిన బఠి।యించిన వినినన్
అవ్వీరగురుడు శుభముల
నవ్వారికి బూర్ణముగ ద।యామతి నిచ్చున్.

గద్య

ఇది శ్రీ బ్రహ్మేంద్ర భక్తిప్రచారక బ్రహ్మేంద్ర దత్త

'కవివతంస' బిరుదాంక శ్రీరామ బ్రహ్మనామక

శ్రీరామ శర్మ ప్రణీతంబైన

శ్రీ బ్రహ్మేంద్ర సంపూర్ణ చరిత్రము

బుఱ్ఱకథ

సంపూర్ణము

(శ్రీ)

త ప్పొ ప్పు ల ప ట్టి క

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 3 | 15 | ముతల్లీ | మతల్లీ |
| 4 | 12 | శకల్యాణ | శతకల్యాణ |
| 12 | 19 | ప్రోలే। | ప్రోల్లే |
| 14 | 18 | మాదరం | మాదవరం |
| 19 | 5 | నింక | మఱియు |
| 27 | 12 | ఓంకాచా | ఓంకారాచా |
| 34 | 9 | పరహ | పరమహ |
| 37 | 18 | సాషాంగా | సాష్టాంగ |
| 38 | 5 | బ్రహ్మోము | బ్రహ్మము |

# బుఱ్ఱకథా సంబంధములు

## అనుబంధము 1

కథపలీ బుఱ్ఱకథ 7 వ పుట — 15 వ బంతి—16 వ బంతి మధ్య అడ్డగీతగల సందులో దీనిని జేర్చుకొనవలెను.

కథ:- జననికడకు జని "జననీ నాదొక । మనవి వినగదమ్మా!
చనియెద దేశాటనకు భక్తజన । సంరక్షణకమ్మా!
అని పేరంభట్లయ్యావల్క" పా । పాంబ కుమారునితో
తనయా! యివ్విధముగ వచియించుట । తగునటో యినీకు
దేశాటనకిపుడేమి మించినది । తెలిసికొనుము తండ్రీ!
ఆశించితినను పోషించెదవని । ఆత్మలోన నేను
పీఠాచార్యుడవౌదువంచు నే । పెట్టుకొంటికోర్కె
పెండ్లి జేసి నే నీకుదయించెడి । బిడ్డల గననుంటి
అట్టి నామనోరథముల నన్నిటి । వ్యర్థముగా జేసి
అరుగకుమిపుడనునట్టి తల్లి పా । పాంబగారిజూచి
తల్లీ! నీవిటువంటికోరతలను । తలపునుంచకమ్మా!
ఎల్లసౌఖ్యములు కోరినట్లు నీ । కేను గూర్తునమ్మా!
ననుదలంచుమాత్రమున నీకు నే । గనిపించెదనమ్మా!
వనటబొందకను నన్నుబంపుమీ । వని కుమారుడపుడు

## అనుబంధము 2.

కథకులీ బుఱ్ఱకథ 9 పుట— 14 వ బంతి 15 వ బంతి మధ్య అడ్డగీతగల సందులో దీనిని జేర్చుకొనవలెను,

వంత:—ఓరీ! స్వామివారు గోపాలన జేయునప్పటి విషయ

ములు కొంచము విపులముగా వినిపించుమురా !

కథకుడు:—ఆలాగె వినుము.

కథ :— వీరప్పయగా నావులఁ గోల్లాని । వెళ్లుచుండువాడు
రవ్వలకొండసమీపంబున । నాలనుంచువాడు
ఏతట్టుకున విపోవకుండ నొక । గీతగీయువాడు
ఆ తరువాతను దానుకొండపై । కరుగుదెంచువాడు
పాయక నచ్చట కాలజ్ఞానము । వ్రాయుచుండువాడు
సాయంతనమున కావుల గొని కొ । ష్టంబు జేర్చువాడు
ఇటులనుండ తదితర గోపాలకు । లింపుగ నచ్చమతో
ఎటకుజనునో వీరప్పయ గోవుల । నేలుట లేదమ్మా !
కాలిగీతలో నావులనిల్పియు । గానగరాదమ్మా !
జాలము సేయక వచ్చి చూడుము నిజంబు దెలియునమ్మా!
అనియపుడప్పుడు చెప్పుచుంటవిని । అచ్చమయొకనాడు
వనమున వీరప్పయ్యను గాంచగ । జనియు గీతలోన
కుదురుగ ధేనువులుండుట కెంతో । కుతుకంబొందియును
కుధరము పైగుహకరిగియు నచ్చట । గూర్చొని గ్రంథంబు
వ్రాయుచుండు వీరప్పయగని యభి । వాదంబుల జేసి
జేయుచున్న గ్రంథ మేమిటని ప్ర । శ్నింప స్వామివారు
కాలజ్ఞానంబని తెల్పగ విని । చాలగ స్తోత్రించి
వ్రాలి పాదముల ముక్తినొసగుమని । స్వామిని ప్రార్థింప
వీరప్పయగారచ్చమగారికి । తారకంబు జెప్పె
వేడుకతో కాలజ్ఞానంబును । విరివిగ వినుపించె

తారకంబు జెప్పెనంటె ఇంతకు ముందు 'హరిహరపురి' లో ఆనందభైరవునికి స్వామివారు చెప్పెనే " ఓన్నమో

వీర దేవాయ" యను అష్టాక్షరీ మహామంత్రము అదె తారకము దానినే బోధించెను.

ఇక కాలజ్ఞాన మెట్లు వినిపించె ననగా—

"అచ్చమాంబా! వినుము 4808 సంవత్సరములు ఈ కలియుగంబులో జరిగిపోయినపిమ్మట ధర్మదేవత భూలోకమందు పుణ్యస్థలంబులలో దిరుగుచుండును. పాపంబులు నానాటికి హెచ్చి ఎందున లేని కలహంబులు పుట్టును. అధిక అహారము అధిక నిద్రి కలిగి నిలిచిన తావున నిల్వక సమస్తమైన నరమృగాదులు సంచరించును, శాంత గుణము గల్గినవారలు కోపవంతులయ్యేదరు. నీచులు అధికులగుదురు. అధికులు ఎందుకు గొరకాకుందురు, విప్రులు తమతమ ధర్మంబులు విడచి మనిషి కొక్క-క్క-గుతమై నీచుల నాశ్రయించి షట్కర్మరహితులై చెడిపోదురు. రాజులు తమ రాజధర్మంబులను విడచి చోద్యవంతులై నీచకార్యంబుల్ంజొచ్చి దేశాలపాలగుదురు. తమ తమ కులంబులు వదలి అధర్మముచేత దుష్కర్ములై పోదురు. శూద్రు లసత్యవాదులై నీచ సాంగత్యముచేత దరిద్రులై చెడిపోదురు. ప్రతి జాతియు సంకరంబై పరస్పర వైరంబులు హెచ్చి మతకలహంబుల వలన కొట్టుకొని మరణింతురు. దుష్కర్మల వలన బహు విధంబులైన కష్టంబులొంది చెడిపోదురు. పైరుకొంచముగా ఫలించును. గోవులు కొంచముగా పాలు పిండును. తండ్రి కొడుకులుతమలో తాము కలహించేరు"

అని స్వామి వారీవిధముగా అచ్చమగారికి కాలజ్ఞానంబు వినుపించెను.

వంత .—సరే ఇక గానిమ్మా,

కథకుడు:—ఇట్లచమ్మగారు స్వామివారి వలన మంత్రాదుల గ్రహించి కాలజ్ఞానమువిని తదాది వారి వాక్యానువర్తియై సంచరించుచు నేలమఠంబు గట్టించి వారి నందుంచి వారికి గావలసిన గోక్షీరాదికములనిచ్చుచు సేవించు చుండెను. స్వామివారును తన్మఠమున గూర్చొని ఆనందముగా కాలజ్ఞానము పూర్తి జేసికొను చుండెను.

ఇట్లుండ నొకసమయమున వెంకటాద్రిభట్టను విప్రుని కుమారుడు అన్నాజయ్య అను బాలకుడు పుణ్యక్షేత్రముల జూచుకొనుచు బన్గానపల్లెకుజేరి స్వామిని సందర్శించి అనేక నమస్కారములాచరించి స్వామీ! తామిపుడు వ్రాయుచున్న గ్రంధమేమిటన స్వామివారిది భూతభవిష్యద్వర్తమాన కాలజ్ఞానంబని తెలుప అన్నాజయ్య సంతసించి అందు విషయములించుక వినిపించుమనికోర నపుడా వీరప్పయ్యగారు

అనుబంధము 3.

కథకులీ బుఱ్ఱకథ13 వ పుట—15వ బంతి, 16వ బంతి మధ్య అడ్డగీత గుర్తుగల సందులో దీనిని జేర్చుకొనవలెను.

వంత:—అది సరేగానిఇపుడొకటి జ్ఞాపకము వచ్చినది. ఏమిటంటే బ్రహ్మముగారు పోలేరమ్మను చుట్ట త్రాగుటకు నిప్పడిగినట్లుండ నీ వటుగాక పైకము బదులిడు

మనుచున్నట్లు చెప్పి నావేమిటిరా ?

కథకుడు—ఔను! స్వామివారిని చండా నిమ్మని పోసలో త్రిడి జేయుచుండ చుట్ట త్రాగుటకు స్వామివారమ్మ వారిని, నిప్పడుగవలెనా? బాధ తప్పించుకొనుటకు పైక మడుగవలెనా ? నీవే చెప్పుము.

అనుబంధము 4.

కథకలీ బుఱ్ఱకథ 23 వ పుట— 25 వ బంతి క్రింద దీనిని జేర్చుకొనవలెను.

వంత:— ఓరీ ! సిద్ధని ద్వారము దాటిపోవునట్లు సేయుడని కుమారులకు జెప్పిన గోవిందమ్మగారేమిటి ?

సిద్ధని దీవించుటేమిటి? ఏది బట్టిన ఊరంతయు నుత్తరమంటె నీవు దక్షిణమంటావు గదరా !

కథకుడు :—ఓరీ! గోవిందమ్మ పెండ్లి గాక పూర్వము తనకు వచ్చు వరుడిక మూడు రోజులకు వచ్చునని చెప్పెను తండ్రి చూడ వచ్చినపుడు వంటజేయకయె వేడి వేడి పదార్థములతో భోజనము పెట్టెను. అట్టియామె అజ్ఞానురాలువలె సిద్ధనిద్వారము దాటిపోవునట్లు సేయుడని కుమారులకు జెప్పునా ?

వంత:—సరే కానిమ్ము.

కథకుడు:— అప్పుడు సిద్ధయ్య స్వామివారిని జూచి.

అనుబంధము 5,

కథకలీ బుఱ్ఱకథ 25 వ పుట—6 వ బంతి, 7 వ బంతి మధ్య అడ్డగీత గుర్తుగల సందులో దీనిని జేర్చుకొనవలెను.

వంత :—ఓరీ ! వారు లోకోద్ధారకులు మహానుభావులం

టావె, సిద్దయ్య ఉపదేశమునకు వచ్చి నప్పుడు గోవిం దాచార్యాది సోదరులు కులహీనుడవు నీకుప దేశము జేయరాదు. వెళ్ళిపొమ్మని కరవాలములతో బైకురు కుట, ఆ పైన బ్రహ్మముగారు కుమారుల 'నూరకుం డుడీ' యని బ్రతిమిలాడుట, అప్పుడు సిద్దయ్య గురు పుత్రులతో దమవంటివారు కులభేదముల బట్టవచ్చు నా ? ఆత్మకు కులభేదంబులు గలవా ? యని నీతుల బలుకుట, ఈశ్వరమ్మగారు సలహా చెప్పుట ఎవరికి దెలియదు ?

ఇట్టి వన్నియు గప్పి పుచ్చి బ్రహ్మముగారు సిద్ద య్యను ముందు నీవు గోరినట్లు మోక్షమార్గములో బ్రవేశింపజేసెదనని కుమారుల జూచి వీనికి ముందు గ్రహింపవలసిన విషయముల జెప్పుడు నేను తక్కినది పూర్తి జేతునన్నాడనుట తొల్త పెద్దకుమారుడు గోవిందాచార్యులు బోధసేయుచెట్లసిన యనుట సరి పోయినదా ?

కథకుడు:—బలే మాటంటివి, బ్రహ్మముగారు భగవంతుడు గదా, ఇక నాయనకు బుట్టిన కుమారు లజ్ఞానులగుదు. రా ? వారు కులభేదముల బాటించి సిద్దనిపై కురుకు దురా ? అందును కరవాలములతోనా ? ఆ కాల మున బ్రహ్మముగారి ముఖావలోకనమున నెట్టి పరమ దుర్మార్గులుకూడ విజ్ఞానులగుచుండ నిత్యము స్వామి వారి ముఖావలోకన మెన్ని సారులో గల్గిన వీరికి సహజజ్ఞానము లేకున్నను ఇట్టి జ్ఞానమైన గలుగదా ?

ఇక భగవంతుడగు బ్రహ్మముగారు, దుర్మార్గుల సన్మార్గుల జేసి భక్తులొందు బాధల దొలగించిన బ్రహ్మముగారు ఇంటిలోని కుమారుల నలుగురిని వశ్యపరచుకొనలేక సామాన్యుల విధమున బ్రతిమి లాడునా ?

విజ్ఞానాగ్రేసరులగు గురుపుత్రులెక్కడ ? అల్పజ్ఞు డగు సిద్ధ డెక్కడ ? ఇక నీతడా ? గ్రుడ్డు వచ్చి పిల్ల నెక్కిరించినట్లు వారికి నీతులు బల్కుట.

ఈశ్వరమ్మగారి సలహాతోనేమి పని ? తాతగారు 153 సంవత్సరములవారు. తండ్రిగారు 80, 90 సంవత్సరంబు లీడుగలవారు. వీరుభయులకు తెలియని పక్షమున సుమారు 20 సంవత్సరము లీడుగల ఈమె సలహా జెప్పుటయా ?

ఇదంతయు అబద్దాల పంచాంగమునకు 60 ఘడియలు చార్జమన్నట్లున్నది. దీని నమ్ముటెట్లు ?

వంత:—ఓరీ ! యిప్పుడు చెప్పిన దంతయు క్రొత్తగా నున్నది ఇది దేనిలోనున్నది ?

కథకుడు—ఇది యీ గ్రంథకర్తగారు చేసిన "బ్రహ్మేంద్ర సర్వస్వము" అను గ్రంథమున నున్నది.

అనుబంధము 6

కథకులీ బుఱ్ఱకథ 34 వ పుట 22 వ బంతి, 23 వ బంతిమధ్య అష్టగీత గుర్తుగల సందులో దీనిని జేర్చుకొనవలెను,

" జాతి జాతికీ చాలా వైరములు గల్గేని ఈశాన్యము నుండి విషగాలి వచ్చేని. విశ్వనాథా వధూత యను

విశ్వ బ్రాహ్మణులు పుట్టేను. ఉల్లిగడ్డలకు వుపదేశ మిచ్చేటి కల్ల గురువులు కలిలోనుండేరు. ఆనంద వత్సరంబున నాగుమల్లె నసియించేను, నాగుమల్లెరీతి నరులంత జచ్చేటి యోగంబువచ్చును. బహుధాన్య విక్రమ వత్సరంబులలో బహుగ యుద్ధములు జరిగేను. బహుధాన్యలోపల అన్ని జాతులొకటయ్యాని, బీద ధనవంతులొకటిగ అయ్యేయోగము కూడ వచ్చేని. తల్లులు బిడ్డలు తగవులు నడిచేని. పొట్టుపోయి గట్టిని లిచేని. వానివరుస లేకపొయ్యేను. పంటలు యెండేని, నీచులు ప్రజలయి సాధుబాధలోనర్చేరు” అని యివ్విధముగా కాలజ్ఞానము జెప్పి,

అనుబంధము 7.

కథకలీ బుఱ్ఱకథ 41 వ పుట 8 వ బంతి, 9 వ బంతి మధ్య అష్టగీత గుర్తుగల సందులో దీనిని జేర్చుకొనవలెను.

తదుపరి భక్తులను జూచి ఓ భక్తులారా! మీరందరు నే రచియించిన కాలజ్ఞానము కాళికాంబ శతకము వచనములు గోవింద వాక్యములు సిద్ధ ప్రబోధము మున్నగు గ్రంథముల జదువుచు, నాపూజల గావించుచు నా వీరధర్మముల వెదజల్లుచు నా ప్రచారకుల నాదరించుచు నుండవలసినది. మీ కిది నా తుది ప్రబోధమని చెప్పి,

N. B:— ఈ కథ సిద్ధయ్యను వేదాంత పాఠశాలలో జేర్చు వరకు ఒకరోజును, గద్యతోపూర్తియగు వరకు రెండవరోజును చెప్పవచ్చును.

అనుబంధము 8.

కథకులీ బుఱ్ఱకథ 5వ పేజీకడపటి మూడుబంతులకు బదులుగా దీని జేర్చుకొనవలయును.

కథకుడు:- ఓరీ! బ్రహ్మముగారు భక్తరక్షణకు వచ్చినదిప్పటి కంత నాల్గువందల చిల్లర సంవత్సరములేకదా అనగా 16వ శతాబ్దముననేగదా. అప్పుడేగదా తుళువ వంశస్తులు రాజ్యమేలినది. తుళువ వంశమువారిలో శ్రీకృష్ణదేవరాయలు 1509 మొదలుకొని 1530 వరకు రాజ్యము చేసెనుగదా. అప్పుడే అష్టకవులు అనగా అలసాని పెద్దన్న ముక్కుతిమ్మన భట్టుమూర్తి రుద్రకవి లోనగువారున్నారుకదా. అప్పుడు

శ్లో॥ భూర్భూమి రచలానన్తా। రసావిశ్వమ్భరా స్థిరా,
ధరాధరిత్రీ ధరణిః। క్షోణిర్జ్యాకాశ్య పీక్షితిః॥

ఇది అమరములోని శ్లోకము భూమికి పర్యాయశబ్దములుగల యీశ్లోకములో 'అచల' చలింపనిది అను అర్థముగల భూమి స్త్రీయై భూదేవి పేరున సంచరించినట్లు, పాపభారం మోయలేనన్నట్లు నీవెప్పుడైన నెవరివలననైన విన్నావా? ఏ చరిత్రలోనైనా చూచావా?

వంత:- లేదు. ఇంకొకమాట అడుగవచ్చునా?

కథకుడు:- అడుగుము.

వంత:- సరే భూదేవి సంగతి చెప్పినావు. బ్రహ్మము గారు తలిదండ్రులకు బుట్టినట్లు కొందరు చెప్పుట వినుచున్నాము. నీవట్లుచెప్పక శిశువై సరస్వతీ నదీతీరములో నున్నట్లు చెప్పినావ దేమిటిరా?

అనుబంధము 9.

కథకులీబుఱ్ఱకథ 6వపుట ప్రారంభములోని 3 బంతులకుబదులుగ దీనిని జేర్చుకొనవలెను.

కథకుడు:- అవును. బ్రహ్మముగారు భగవంతుడుగదా భగవంతుడు శిశువుగా కాలేడా?

వంత:- కాలేడనికాదు, అయితే కొందరు తలిదండ్రులకే బుట్టినట్లల చెప్పవలెను!

కథకుడు:- అదినిజమైన నెవరుచెప్పినను ఒకే తలిదండ్రులకు బుట్టినట్లు చెప్పవలెనుగదా. అట్లు చెప్పుచున్నారా?

అనుబంధము 10.

కథకులీబుఱ్ఱకథ 12వ పుట 16 వ బంతికడన అడ్డగీతగల చోట దీనిని జేర్చుకొనవలెను.

నీదంపతులకు(గా మోత్సవము జరుగెను. తరువాత నంప కాలు సమయమున గోవిందమ్మతల్లి కుమార్తెను జూచి.

కీర్తన: పోయిరాగదమ్మజానకీ వలె,

గోవిందాంబపోయిరాగదే। మాముద్దుపట్టి।
గోవిందాంబ పోయిరాగదే.
గోవిందాంబ పోయిరమ్మా। కోరికలరబెంచినాము
శ్రీవీరబ్రహ్మమునకిడి। చెలగిపెండ్లిజేసినాము ॥గో॥
సారె చీరెలు ప్రేమతోడ। చాలగా నొసంగినాము
సారసాక్షిపట్టెమంచము।సకలసామానిచ్చినాము॥గో॥

వ॥ అని ఇంకను, కుమారీ!

సతులకు బతియే దైవము, అంతకన్న దైవములేదు గనుక

భక్తితో పతిసేవ జేయుచుండవలెను. అట్టిసేవ జేయువారె పతివ్రతలు. వారికి సాధ్యముకాని దొకటిలేదు. సావిత్రి లోనగు వారెట్టివారైనది నీకు తెలియునుగదా, కాన నీ వట్టి సేవ గావించి భర్త యనుగ్రహమును బొందవలెను ఉభయ వంశములకు కీర్తి దేవలెను. అని అల్లునిజూచి. అయ్యా! గోవిందమ్మ చిన్నపిల్ల, ఈమె శ్రీగారాజము తో బెంచి నీచేతిలో బెట్టినాము. నీవు చక్కని బుద్ధులు చెప్పుచు సేవ జేయించుకొనవలయును అనిచెప్పెను. అనం తరము ఆ దంపతులు కందిమల్లయపల్లెకు బోయిరి.

వంత:— తరువాత

కథకుడు:— తరువాత

అనుబంధము 11.

కథకులీబుఱ్ఱకథ 13వ పుట 10వ బంతి 11 అక్షరం 12అక్షరం మధ్య నిడివి గీతగల సందులో దీనిని జేర్చుకొనవలెను.

వ॥ యాపౌరులకు జ్ఞానబోధ జేయదలంచినవాడై ప్రక్కన మేకలుకన్పడ అయ్యా!యీ మేక లెందుకని స్వాములవారు పౌరులనడుగ, పౌరులు అమ్మవారికవి బలి నిచ్చుటకు తెచ్చియుంచితిమన, బ్రహ్మముగారు "అమ్మవారు దేవత గదా దేవత మాంసము భుజించునా? అది నిజమేయైన ఏనుగు మాంసమో పెద్దపులి మాంసమో సర్ప మాంస మో బెట్టరాదా" యన పౌరులయ్యా! అవి మము చంపవా? యన అట్లయిన మిముచంపునని అణకువగా నున్న జీవుల నరకవచ్చునా? మహాపాపముగదా? అసలు జీవులజంప మీ కేమిస్వాతంత్ర్యముగలదు? అబ్బా! ఎంత

తప్పా? ఇక మీరింతటనుండి.

కథ:— దేవతలకు జీవులబలినిచ్చుట । తీసివేయరయ్యా!
దేవతలనదగు, తల్లిదండ్రులకు । సేవజేయరయ్యా!
భూరిగుణసుల పెద్దవారలను । గౌరవింపుడయ్యా!
మీ రేటికక్కనువారిని దయతో । మిగులజూడరయ్యా!
హానికార్యముల జేయుటపూర్తిగ । మానుకొనుండయ్యా!
జ్ఞాన మార్గమునజక్కనిరీతిగ । నడువవలయునయ్యా!

అని యివ్విధంబుగా బల్కి.

అనుబంధము 12.

కథకులీబుఱ్ఱకథ 20 పుట 6—7 బంతులమధ్య అడ్డగీతగల.
సందులో దీనిని జేర్చుకొనవలెను.

ఉ॥ పాపములెల్లనేఘనుసి।ప్రార్థనజేయుట నంతమానుసం
తాపములేమహామహుని।ధ్యానమునన్ నసియించిపోవుస
ర్వాపదలేజగజ్జనకు।నర్చనచేతనమాప్తినొందు నా
తాపససేవితః స్వగడుము।దంబునగొల్చెద వీరదేశికున్

అని ప్రార్థించుచు అనుబంధము 13,

కథకులీబుఱ్ఱకథ 26 పుట రెండవబంతి 15—16 అక్షరములకు
మధ్య నిడివిగీత గుర్తుగలచోట దీనిని చేర్చుకోవలెను.

అన సిద్ధయ్య అయ్యా! గురునిస్నానాంగాది శుశ్రూషుల తృప్తి
జేయవలయునన్నావే వానిగుఱించి బోధింపప్రార్థనన.

ఆలాగుననే బోధించెద.

ఆచార్యులవారి గృహకృత్యములు తన గృహకృత్య
ములుగా నెరవేర్చుట. అందు మొదటిదగు స్నాన
శుశ్రూష. గురునికి తలంటుట, స్నానము జేయించుట,

తిలకము తీర్చుట లోనగు సేవగావించుట రెండవదగు అంగ శుశ్రూష. తలిదండ్రులకన్నను, బంధుమిత్రుల కన్నను ఘనుడని తలంచి ప్రేమజూపించుట, మూడవ దగు భావశుశ్రూష. భక్తితో నేప్రొద్దు పరమాత్మ జే యని నమ్మిస్తుతిగావించుట నాల్గవదగుఆత్మశుశ్రూష ఇవి చతుర్విధ శుశ్రూషలు.

అనుబంధము 14.

కథకులిబుఱ్ఱకథ 27వ పుట 7వ బంతి 9-10 అక్షరములమధ్య నిడివిగీతగల సందులో దీనిని జేర్చుకొనవలెను.

అన సిద్ధయ్య అయ్యా! తాముజెప్పుమానవప్రమాణమువింటిని యిక రాగద్వేషముల గుఱించిబోధింపప్రార్థించెదనన

శివరామాచార్యులు వినుము సిద్ధా! రాగద్వేషాదులు పదమూడు అందు.

రాగమనగా.- అన్యస్త్రీని రమించ కోరుట:

ద్వేషమనగా:- అపకారము చేసినవానికి తిరిగి అపకారము జేయు దలంపు.

కామమనగా:- ధన. ధాన్య, పుత్ర పౌత్రాదికముగలిగి తా నధికుడుగా నుండవలెనను కోరిక.

క్రోధమనగా:- తమమాటకు ప్రతిహతముగా భాషించువాని పై జూపు నాగ్రహము,

లోభమనగా:- ఒరులకుపకారమును, దానమును జేయుట యందు తలంపు లేకుండుట.

మోహమనగా:- ధన, కనక, వస్తు, వాహనాదుల మిక్కిలి వృద్ధిజేయు తలంపు.

మదమనగా:— సంపదగల్గి విజృంభించుచు నేనేమిచేసినను చెల్లునను తలంపుతో దుష్ప్రయత్నములు చేయుట.
మాత్సర్యమనగా:—పరులుతమకుచేసిన యుపకారమునకు అపకారము చేయబూనుట.
ఈర్ష్యయనగా.—ఒరుల మేలు సహింపలేకుండుట,
అసూయయనగా:— గుణవంతుని యందు దోషారోపణము జేయుట.
డంభమనగా:— పరులు గొప్పవాడనుకొన వేష భాషలతో నాటోపము చూపుబుద్ధి.
దర్పము.— నాకుమించినవని యొకటిలేదు. నాతో సమానుడు లేడు నేనేయెక్కువైనవాడనని గర్వముగల్గియుండుట
అహంకారమనగా:- ఘనులనుజూచి నిర్లక్ష్యముగా మాటాడుట, ఇవి రాగద్వేషాదులు.

అనుబంధము 15.

కథకులీబుజ్జికి 28వ పుట 14వ బంతి కడన అడ్డగీతగలచోట దీనిని జేర్చుకొనవలెను,
సిద్ధయ్య స్వామీ! ఇపుడు తాము దయతోజెప్పిన పిండోత్పత్తి వింటిని. ఇక అష్టమదముల గుఱించి బోధ జేయుడని వేడ
ఓంకారాచార్యులు అలాగే వినుము. అష్ట మదములనగా నెనిమిది. అందు,

నేనైశ్వర్యవంతుడను నన్నెవ్వడేమి చేయజాలడని దుష్టకార్యములొనర్చుట ధనమదము.

విద్వాంసుడనని ఇష్టప్రకారముబల్కుట విద్యామదము

నేనుగ్రజాతివాడనని పరుల నీచముగాజూచుట. కులమదము
నన్నెవరైన వంచింపలేరని నెదరింపబోవుటయౌవనమదము.
నాకు ప్రభుత్వము కలదని కన్నుగానక ప్రవర్తించుట
రాజ్యమదము.
నేశపించిన బ్రహ్మయైన నశించునని నటించుట తపో
మదము.
నేనుచక్కనివాడను నన్నే వనితజూచిన వరింపకపోదని
స్త్రీలతో బరిహాసమాడుట రూపమదము.
నామాట వినువారుగలరని యకృత్యములు చేయుట
బలమదము. ఇవి అష్టమదములన. వెంట

అనుబంధము 16.

కథకులేబుఱ్ఱకథ 29వ పుట 22వ బంతి కడన నిడివిగీతగల చోట
దీనిని జేర్చుకొనవలెను.

యన సిద్ధయ్య అయ్యా! తామిప్పుడు చెప్పిన సాధనచతుష్టయము
వింటిని సంతసమయ్యె. ఇక తాపత్రయమునుగుఱించి
బోధింపవేయున

పోతులూరాచార్యులు వినుమట్లే చెప్పెద.
అధ్యాత్మికతాపము అధిభౌతిక తాపము అధిదైవిక
తాపము అని తాపములుమూడు. అందు.

అధ్యాత్మికతాపమనగా:— వాత పిత్త శ్లేష్మ వికారములవలన
గలిగిన వ్యాధులచే పరితపించుట—
అధిభౌతిక తాపమనగా:— సర్ప వృశ్చికాది జీవకోటి వలన
కలుగు బాధలకు దుఃఖించుట—
అధిదైవికతాపమనగా:— పిడుగు, భూకంపము లోనగు

వానివలన కలుగు కీడు.

అనుబంధము 17.

కథకులీబుర్రకథ 35వ పుట 5వ బంత్రి 14-15 అక్షరముల మధ్య నిడివిగీతగలచోట దీనినిజేర్చుకొనవలెను.

యన

సిద్ధయ్య గురుస్వామీ! కాలజ్ఞానవిషయములగురించి అష్టాంగ యోగములలోని ఆసనములగురించి అండ పిండ బ్రహ్మాండముల గురించి చక్కగాజెప్పియుంటిరి. ఆనందమయ్యెను. ఇక అష్టసిద్దులగురించి బోధింప వేడుచున్నానన, స్వామివారు వినుమట్లుచెప్పెద.

శ్లో॥ అణిమా మహిమాచైవ । లఘిమాగరిమాతథా
ప్రాప్తిప్రాకామ్యమీశత్వం।వశత్వంచాష్టసిద్ధయః॥

అనగా అణిమ, మహిమ, లఘిమ, గరిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశత్వము, వశత్వము, అను సిద్ధులు యెనిమిది. వీనిని అష్టసిద్ధులని చెప్పబడును.

అణిమ:— సమస్తవస్తువులకంటె నల్పముగానగుట.
మహిమ:— అన్నిటికంటె గొప్పగా గనపడుట.
లఘిమ:— దూదికన్నను మిక్కిలి తేలికగానగుట.
గరిమ:— సమస్త వస్తువులకంటె బరువుగానగుట.
ప్రాప్తి:— కోరినదానిని గల్గజేసికొనుట.
ప్రాకామ్యము:— ఆకాశగమనము గల్గియుండుట, దేహము ఇష్టమొచ్చినంతకాలము నిలుపుకొనుట.
వశత్వము:— సర్వజీవుల లోపడునట్లు జేసికొనుట.
ఈశత్వము:— ప్రభువువలె ప్రకాశించుట. అవి చెప్పి

## మా భక్తోపకరణములు.

బ్రహ్మేంద్ర పటములు చిన్నది 0-4-0 పెద్దది 1-0-0

బ్రహ్మేంద్ర విగ్రహములు సిమెంటుతో జేసినది 10-0-0

బ్రహ్మేంద్ర పాదములు శిరమున బెట్టునది 10-0-0

బ్రహ్మేంద్రచలువచప్పరములు గజన్నరయెత్తుగలది 40-0-0

## మా భగవన్నామక్రియలు

పుంస్త్వప్రద:- ఇది పురుషులకున్న సమస్తశుక్ల దోషములను బరిమార్చి పురుషత్వము నిచ్చును. 20 రోజులకు 3-0-0

కుసుమహార.- ఇది స్త్రీలకున్న సమస్త రజోదోషములను దీసివేసి మంచిసంతానము నొసంగును. 20 రోజులకు 3-0-0

సింహబల:- సమస్త స్త్రీ పురుషులు సేవింపదగినది. రక్తశుద్ధి, వృద్ధి, గలిగించును. 20 రోజులకు 3-0-0

షరా:- ఇంకను భగవన్నామరసాయనాది క్రియలు గలవు.

## మా విడి గ్రంధములు.

శిల్పమాతృస్తవము:- ప్రకాశకులు:- శ్రీ వేలూరి శ్రీశైల శర్మగారు వంగవోలు. వెల 0-4-0

రామాయణగేయములు:- ప్రకాశకులు:- మద్దాళి తిరువెంగళము శ్రేష్ఠిగారు విజయవాడ వెల 0-4-0

కోటీశ్వరక్షేత్రయాత్ర:- ప్రకాశకులు:- చుండూరి శేషయ్యగారు చందలూరు వెల 0-2-0

## భక్తులకొక సూచన.

మా బ్రహ్మేంద్ర సంపూర్ణ చరిత్రము పురాణము జెప్పు వారును మా బ్రహ్మేంద్ర సేవాదర్పణములోని గేయకాల క్షేపము చేయువారును మా యీ బుఱ్ఱకథను జెప్పువారును కావలసియున్న మాకడకురండు. మా అడ్రసు,

శ్రీరామ బ్రహ్మాశ్రమము ఒంగోలు